1978 డిసెంబర్

86

భూమయ్య, కిష్టాగౌడ్ సంస్మరణ

రోజెన్‌బర్గ్ దంపతుల పరిచయం

ఎర్ర జెండెర్రజెండెన్నియలో పాట

కుంపటి కథ

మానవ జీవితంలో మనస్సు పాత్ర - జిజ్ఞాస

బాధకుల కొరకు కర్రబెత్తాలు

ఎన్ ఎస్ ఎస్ ప్రయోజన విద్యా కరపత్రాలు

భావవాదం - భౌతికవాదం

భారతీయ తత్వశాస్త్ర దృక్పథాలు

కొలిమంటుకున్నది నవల సీరియల్

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు ఈ సంచిక రు. 1-50 పైసలు

ఈ సంచికలో....



---

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

---

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Warangal Printing Press, J.P.N. Road. Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మా స ప త్రి క

**86**

డిసెంబర్ 1978

## 'ఉరి పాట'

రోజెన్‌బర్గ్ దంపతులు, భగత్‌సింగ్, కయ్యూరు కామ్రేడ్స్, భూమయ్య. కిష్టాగౌడ్, కృష్ణన్‌చెట్టి– అమెరికా, బ్రిటన్ సామ్రాజ్య వాదాల గురించి నెహ్రూ, ఇందిరా, మొరార్జీ ప్రభుత్వాల స్వభావాల గురించి 'ఉరితీయబడ్డ శిరస్సు'లతో పలుకుతున్నారు.

అటు ఊపిర్లకు ఉరిబిగించే దోపిడీ ప్రభుత్వాల స్వభావాన్ని
అర్థంచేసుకొని
ఇటు ఉద్యమాల ఊపిర్లు నిలపడానికి ప్రజల కొరకు

'ఉరికంబం మీద నిలచి
ఉజ్వల గీతం పాడిన'

మృతవీరులను తలచుకుందాం.

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా 15 రూపాయలు  ఈ సంచిక రు. 1-50 పైసలు

# ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యలో....

అల్లం నారాయణ

ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యలో
ఎర్రెర్రనిదీ జెండెన్నియ్యలో
పేదల పాలీటెన్నియ్యలో
మరి పెన్నిది ఈ జెండెన్నియ్యలో ॥ఎర్ర॥

అన్నలు అన్నా లెన్నియ్యలో
మరి ఎన్నెల కోనాలెన్నియ్యలో
ఎన్నెల కోనాలెన్నియ్యలో
మరి ఎలుగూ రవ్వాలెన్నియ్యలో ॥ఎర్ర॥

తూరుపు దిక్కూ నెన్నీయలో
మరి సూర్యుడు పొడిసిందెన్నీయలో
ప్రజలా కొరకూ ఎన్నీయలో
మన అన్నలు నిలిచారెన్నీయలో
పడమటి దిక్కూ నెన్నీయలో
సూరుడు గుంకిందెన్నీయలో
ప్రజలా మధ్యా నెన్నీయలో
మన అన్నలు ఒరిగా రెన్నీయలో
ఒరిగిన అన్నల కెన్నీయలో
మన ఎర్రని దండా లెన్నీయలో ॥ఎర్ర॥

పేకటి కొండ ల్లెన్నీయలో
మరి సివరీ మూల లెన్నీయలో
నక్సల్ బరి నుండెన్నీయలో
మరి నాలుగు దిక్కూ లెన్నీయలో
పోరు సాగం గెన్నీయలో
మరి పోరూ మార్గం లెన్నీయలో
ఒరిగిన అన్నల కెన్నీయలో
మన ఎర్రని దండా లెన్నీయలో ॥ఎర్ర॥

అగదు అగా దెన్నీయలో
పోరాటా మాగా దెన్నీయలో
పోరూ మార్గం లెన్నీయలో
మరి నువ్వూ నేనూ ఎన్నీయలో
నువ్వూ నేనూ ఎన్నీయలో
మరి కలిసే పోదా మెన్నీయలో
కలిసే పోదా మెన్నీయలో
మరి నడిచే పోదా మెన్నీయలో ॥కలిసే॥

ఎర్ర జెండెర్ర జెండెన్నియ్యలో
ఎర్రెర్రనిదీ జెండెన్నియ్యలో ॥ఎర్ర॥

---



---

డిస్టర్బ్డ్?

ఏలినవారు ఎందుకు డిస్టర్బ్డ్‌గా వున్నారు?

ఏలినవారికి ఏడుగడగావున్న దొరలదోపిడీ ప్రశాంతత భగ్నమయిందట. తట్టలుమోసిన, కట్టెలుకొట్టిన, బట్టలుఉతికిన, బాసన్‌లు కడిగిన, బంగ్లాలుఊడ్చిన దున్నిన, నాటిన, కోసిన, నూర్చిన జీతగాడు బతుకుకు సరిపోయే మెతుకుపెట్ట మన్నా డట. బరువుబతుకు, బాన్చెనుబతుకు కాకుండా మంచిబతుకుకోసం బరితెగించి నిలిచా డట. ఎన్నాళ్ళుగానో వంగిపోయిన వెన్నుసవరించుకొని వెట్టివాడు నిటారుగా నిలుచు న్నాడట. ఇంకెంతోకాలం తమమానాలు 'పత్తిబంగారం'లా దొరలకు, దొరలగుండా లకు అర్పణం చేయడానికి అంగీకరించేది లేదని జనకవ్వలు, బానవ్వలు, రాజవ్వలు కంఠంలో కొనఊపిరిదాకా పోరాడడానికి, కళ్ళల్లో కొనవెలుగులదాకా పెనుగులాడ డానికి కొంగుబిగించారట. దొరచెప్పుకిందముల్లు, గడీ గోడనీడన గుడిసె, కాళ్ళకింది ఇసుకను తొలిచేనీళ్ళలా, తరుముకొనివచ్చే మంటలా ప్రశ్నించాయట.

'కాళ్ళకిందిదుమ్ము కళ్ళల్లో పడ్డట్లయింది'ట.

దొరలదోపిడీ ప్రశాంతత భగ్నమయిందట. దొరల ఎన్నికైనబంటు ఏలిన వారు ఏకాఏకిన 'కల్లోలిత ప్రాంతాలు'గా జగిత్యాల, సిరిసిల్లాలను ప్రకటించారట.

చినమెట్‌పల్లిలో మాదిగగూడెంలో జనం 'ఏంబతుకులు మనయిరో యములా రాజ్యమ్ములో' అనిపాడితే యమధర్మరాజు తుపాకికాల్చక ఏంచేస్తాడు! లొత్తునూరులో రావనికి పోవనికి సుంకరోడురాక, ఎంగిలి విస్తరి ఎత్తేయడానికి చాకలోడురాక సాంఘిక బహిష్కరణచేస్తే, సీరేటికాడు తనచేతిలోనికట్టె తనవెన్నుమీదనే విరగ డానికి అంగీకరించక పెనుగులాడితే అమీన్‌సాబ్ 'ఫైర్' అనక మరేంచేయగలడు! ఇతరుల ఎంగిలివిస్తళ్ళు తీసేవృత్తి చాకలివాళ్ళదని, తీయకపోతే తుపాకితోకాల్చేవృత్తి పోలీసులదని మనుధర్మశాస్త్రం, మనధర్మశాస్త్రం చెప్పడంలేదా? కుదురుపాకలో ఏడు గురు అక్కచెల్లెళ్ల 'మానసంరక్షక' సంఘం పెట్టుకుంటే ఏడుగురు దొరగుండాలు ఎత్తుక పోయైనా ఒకఅక్కను రాజక్కను చెరచక ఏంచేస్తారు! గుమ్మలాపురంలో గుమ్మలు తమమగవాళ్ళను ఎందుకు అరెస్టుచేస్తారని అడిగితే తలలుబాదుతూ లాఠీచార్జ్ చేయక పోలీసులు చెప్పగల జవాబేమున్నది! అణచివేత అతిసహజమైన ధర్మంగా హక్కుగాకాక అసహజమైన అధర్మంగా గుర్తించే చైతన్యం జనంపొందడమంటే అది కల్లోలంకాక మరేమిటి! న్యాయమైన హక్కులకోసం తిరుగుబాటు చేయడం తమ జన్మహక్కని జనం గుర్తించడం కల్లోలంకాక మరేమిటి! ధిక్కారాన్ని సహించడమే దొరపని అయితే ఇంకదొరయేంది, దొరపెత్తనమేంది!

సిరిసిల్ల, జగిత్యాల తాలూకాల్లో దౌర్జన్యం, హింస, హత్యలు జరుగలేదని ఎవరనగలరు? సిరిసిల్ల తాలూకా కన్నాపురంలో జగిత్యాల తాలూకా ధర్మపురిలో లక్ష్మిరాజ్యం, పోశెట్టి భూస్వామ్య దోపిడీని ఎదురించినందుకు భూస్వాములచేత చంప బడలేదా? దొరలు, భూస్వాములు మధ్యతరగతి రైతుల నుంచే కాదు, నిరుపేద ప్రజల నుంచి కూడ నజరానాలు, జరిమానాలు వసూలు చేయలేదా? హరిజనుల, బల హీన వర్గాల ఇళ్ళు ధ్వంసంచేసి, దౌర్జన్యంచేసి కల్లోలం సృష్టించలేదా? లొత్తునూరు పోలీసు క్యాంపులో వున్న స్పెషల్ పోలీసు దొర ఇంటిముందరి గొల్లాయన కూతురుకు రైక కణుము పంపించి పోలీసు క్యాంపుల అవసరమెందుకో స్పష్టం చేయలేదా? ఎవరనగలరు ప్రజా జీవితం ప్రశాంతంగా వుందని, కల్లోలం లేదని!

కాని ఏలినవారు ఎందుకు డిస్టర్బ్ అయ్యారంటే- లక్ష్మిరాజ్యం, పోశెట్టి చిందిం చిన నెత్తురులో భూమికోసం, భుక్తికోసం పోరాటం పల్లవించినందుకు. 'దొర అట్లా తుపాకితో కాలుస్తూవుంటే చూస్తావేమయ్యా, అరెస్టుచేయక- ఆ వేషమూ, ఆ తుపాకీ నాకివ్వు, నేను అరెస్టు చేస్తాను' అని ఒక రైతుకూలీస్త్రీ పోలీసు అధికారిని నిలదీసి నందుకు. సిరేటికాడు అమీన్‌సాబ్‌కైనా సరే తనను కొట్టడానికి కట్టెను అందివ్వ నందుకు. తమస్త్రీతో అక్రమ సంబంధం పెట్టుకొని ఆమెభర్తనే కొట్టిన దొరను ప్రజలు మెడలో చెప్పులతో ఊరేగించి నందుకు. కనకవ్వలు, జానవ్వలు, కొండయ్యలకూ, గుండాలకు చిక్కకుండా సంఘాలు పెట్టుకున్నందుకు. దొరలకుచాల భయమేసింది. ఏలిన వారికి చాలకోపం వచ్చింది. డిస్టర్బ్ అయిపోయిన దొరలు పట్టణాలు పట్టు కొని పోలీసులను వెంటబెట్టుకొని గ్రామాలకు వస్తూపోతూవున్నారు. పోలీసులు గ్రామాల్లో దొరల గడీల్లో క్యాంపులుపెట్టి 'శాంతిభద్రతలు' కాపాడుతునే వున్నారు.

దొరల గుండాలనుంచి మానప్రాణాలు అరచేత పట్టుకొని పొరుగూళ్ళో తల దాచుకుంటున్న కుదురుపాక హరిజనస్త్రీలు, జీపునుచూస్తే కాల్పులు జరపడానికి వచ్చిన పోలీసులనుకొని భయపడి పరుగెత్తుతున్న లొత్తునూరు పసిపాపలు, పొద్దూ మాపూ జగిత్యాల పోలీసు స్టేషన్‌లో సంతకాలు పెడుతూ ఇల్లూ వాకిలివదిలి కండీష నల్ బెయిలుస్వేచ్ఛకు కట్టివేయబడిన చినమెట్‌పల్లి, లొత్తునూరు షకళ్ళు, అల్లిపురం మొదలైన గ్రామాలకుచెందిన అనేకమంది రైతుకూలీలు 'సంఘమే' శ్వాసగా, ఆశగా కష్టాలు సహిస్తున్నారంటే సంఘబలం తెలిసిన దొరలు కల్లోలం చెందకుండా కంటి నిండా నిద్రపోగలరా! వాళ్ళపీడకలలూ, కష్టజీవుల కమ్మటికలలూ నిజమయ్యేరోజు పురిటినొప్పులు అనుభవిస్తున్నది.

20-11-78 — సంపాదకుడు

# కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్

కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్‌లు కళ్ళల్లో ఆడుతున్నారు. బట్టతల, పెద్ద మొహం, దృఢకాయం, కొంచెం పొట్టి, నిదానం, సౌమ్యత- భూమయ్య. ఉంగరాల జుత్తు, మీసం, ఆవేశము, నిర్లక్ష్యముచెరలాడే కళ్ళు- కిష్టాగౌడ్. ఈ ఇద్దరూ చూసిన వాళ్ళందరి మనసుల్లోనూ మనోచిత్రాలుగా వుండిపోవలసిందే ఇంక. చూడని వారికి రెండు పేర్లు. రెండు ఎర్రని పేర్లు. ఆ పేర్లచుట్టూ తెలుగు దేశంలో ముప్పది సంవత్సరాల వీరతెలంగాణ, పది సంవత్సరాల నక్సల్బరీ, శ్రీకాకుళ జ్ఞాపకాలు- రెండు సంవత్సరాలు ఆ యిద్దరి గూర్చి సాగిన ప్రజా ఆందోళన- ఒక సంవత్సరంపాటు దేశాన్ని ఆందోళన పరచిన ఉరిశిక్ష- చివరకు ఎమర్జెన్సీ చీకటి తెరమాటున ఉరికంబానికి వేలాడిన రెండు సజీవ వర్గచైతన్య ప్రాణాలు- ఈనాడు ఆకాశంలో అరుణతారలు.

ఎక్కడా వాళ్ళదొక్క- ఫోటో కూడ లేదు- మొదటిసారి వాళ్ళ ఉరిశిక్ష తేదీ నిర్ణయమై వాళ్ళ కా విషయం తెలియజేసిన రోజు నవంబర్ 25, 1974. దినమంతా ఎలాగైనా వాళ్ళ ఫోటోలు తీయించాలని ప్రయత్నించాం అదే జైల్లో వేరే బ్యారక్స్‌లో వున్న విరసం వాళ్ళం. జెయిల్లో, అందులోనూ ఉరిశిక్షపడి గంజ్‌లో వుండేవారి ఫోటోలు తీయించడం ఎంత కష్టమో ఊహించవచ్చు. ఆ మొదటి ప్రమాదం తప్పిపోయింది. తర్వాత వాళ్ళ రేఖా చిత్రాలయినా చంద్రతో వేయించాలనుకున్నాం- కాని చంద్ర వాళ్ళను చూసేదెట్లా? వాళ్ళతో కుటుంబ సభ్యులకు తప్ప ఎవరికీ ఇంటర్వ్యూలు ఇవ్వరు- ఇచ్చినా వాళ్ళున్న సెల్స్‌దగ్గరికి వెళ్ళాల్సిందే. భూమయ్య, కిష్టాగౌడ్‌లను – ఈనాడు ప్రపంచంలోని పీడిత ప్రజలందరికీ, పరిచయమయిన ఆ ఇద్దరినీ వారుండగా సికిందరాబాదు జైలుకు ఖయిదీలుగా వెళ్ళిన ఏ కొద్దిమందో చూసివుంటారు. బయటవున్న శ్రీశ్రీ, పత్తిపాటి, కన్నభిరాన్ చూసివుంటారు. మానవజాతి స్వేచ్ఛ కోసం కలలుగని, పోరాడిన కామ్రేడ్స్ జెయిలు పాలయ్యారు, ఉరితీయబడ్డారు. స్వేచ్ఛ కోల్పోయి జెయిలుపాలయినవారు మాత్రమే వాళ్ళను చూడగలిగారు- స్వేచ్ఛ ఎంత విలువయినది!

* * *

ఆరోజు మే 10, 1975. అంతకు 15 రోజులముందే విడుదలయి కండిషనల్ బెయిలుమీద హైదరాబాదులో వుంటున్నాను- ఖైరతాబాద్‌లో విరసం యూనిట్ సమావేశమై నేనూ రంగనాథం సీతారాంబాగ్ వెళ్ళిపోయాం. మాతోపాటు నడచి వచ్చి రేడియోస్టేషను ముందు బస్సెక్కాడు నగ్నముని. బస్సులో కొందరు విద్యార్థులు

'భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు రద్దుచేయాలి' అని నినాదాలు యిస్తున్నారు, కరపత్రాలు పంచుతూ. తానూ గొంతు కలిపిన నగ్నమునికి అప్పటికింకా తెలియదు ఆరాత్రి వేకువగా మారకముందే ఆ ఇద్దరి గొంతులూ నొక్కడానికి ప్రభుత్వం కుట్ర సిద్ధం చేసిందని. ఆ విద్యార్థులు చెప్పారు ఆ విషయం నగ్నమునికి– వాళ్ళు డిఎస్‌ఓ విద్యార్థులు– వాళ్ళ చేతుల్లో కరపత్రం పౌరహక్కుల పరిరక్షణ సంస్థ (ఓ పి డి ఆర్) వేసింది. హుటాహుటిని పరుగెత్తుకొచ్చాడు మా దగ్గరికి నగ్నముని. నేరుగా హైకోర్టులో నక్సలైట్ల డిఫెన్స్ కమిటీ బాధ్యుడైన న్యాయవాది యింటికివెళ్ళాం. ఆయన దగ్గరే కన్నభిరాన్ చేస్తున్న ప్రయత్నాల గురించి విన్నాం. ఆయన కళ్ళు అన్ని ప్రయత్నాలు విఫలమయి అలసిపోయాయి. ఎప్పుడు చిరునవ్వు తొణికే ఆ ముఖంలో విషాదం. అక్కడి నుంచే రాష్ట్ర సిపిఐ కార్యదర్శికి ఫోన్ చేసాం– ఢిల్లీలో రాజేశ్వరరావుతో మాట్లాడవలసిందిగా. మేమప్పటికే ఇతనికే నిద్రాభంగం చేసాం. రాజేశ్వరరావు పాట్నాలో వున్నాడన్నాడు– అయితే అక్కడికే ఫోన్‌చేయమన్నాం– అక్కడి అడ్రసు తెలియదన్నాడు– పార్టీ ఆఫీసుకు చేయమన్నాం– వీలుకాదన్నాడు– అయితే ఢిల్లీలో భూపేశ్ గుప్తా ప్రయత్నాలు చేస్తూ వున్నాడని, ఆయనే రాజేశ్వరరావును కాంటాక్ట్ చేస్తాడని చెప్పాడు– మాకు సంతృప్తి కలగలేదు. అక్కడి నుంచి కన్నభిరాన్ దగ్గరికి వెళ్ళాం. అప్పటికే తాను చేయవలసిన, గలిగిన ప్రయత్నాలన్నీ చేసి సెలవుల్లో న్యాయమూర్తులుగా వ్యవహరిస్తున్న చిన్నపురెడ్డి, గంగాధరరావుల దగ్గరికి ముగ్గురు న్యాయవాదులను పంపించి ఎదురుచూస్తున్నాడాయన. అందరం కలిసి జెయిలు దగ్గరికి వెళ్ళాం. అప్పటికే ఆ రోడ్డంతా అక్కడక్కడా చెదరి చెదరి విద్యార్థులున్నారు– ఎక్కువగా పిడిఎస్‌యు, డిఎస్‌ఓ విద్యార్థులు– రోడ్డంతా పోలీసుల కాపలా. 'మేం కోర్టులో రిట్ దాఖలా చేసాం– దానిమీద తీర్పు వచ్చేదాకా ఉరిశిక్ష ఆపండి– కోర్టు సెలవుల్లో వుంది గనుక వెనుకాముందు కావచ్చు–' అని జెయిలు సూపరింటెండెంట్‌కు చెప్పాలని మా ఆవేదన. మాకు మిగిలిన ఆఖరి గడ్డిపోచ అది– కాని మమ్మల్నసలు పోలీసులు ఆ పరిసరాలకు పోనిస్తేగదా. ఇంతలో స్టే ఉత్తర్వులు పట్టుకొని హైకోర్టు అధికారితోపాటు వచ్చారు నరసింహాచారి, ఒపిడిఆర్ వెంకటకృష్ణ, వెంకటరెడ్డి, (వీళ్ళే న్యాయవాదత్రయంగా తర్వాత ప్రసిద్ధమైన వాళ్ళు) మళ్ళీ రెండవసారి ఈ రెండు ప్రాణాలు నిలిచాయి. ఈ వార్త బయటికి ఎట్లా వచ్చింది? ఉరిశిక్షపడిన వారికి 24 గంటలకు ముందు 'రేపు మిమ్మలను ఉరితీస్తారు' అని జెయిలు సూపరెండెంట్ స్వయంగా తెలపాలి. జెయిల్లో ఒక విషయం ఒక ఖయిదీకి తెలిసిందంటే జెయిలంతా తెలిసినట్లే. కాని బయటికి తెలిపేదెట్లా?

10 మే మధ్యాహ్నం 3 గం. ప్రాంతంలో ఒక పిడిఎస్‌యు విద్యార్థి ఆ జెయిలు ముందుగా సైకిల్ మీద హైదరాబాదు వైపు వస్తున్నాడు. అధిక ధరలు, బస్సు రేట్లు, ఆర్‌ఎస్‌ఎస్‌తో ఘర్షణలు వంటి పోరాటాల సందర్భాల్లో ఆ జెయిలుకు వస్తూ పోతూ వున్నవాడు గనుక అక్కడ జవాన్లతో చనువూ పరిచయము వుంది. గేటు ముందువుండే జవాన్‌ను పలకరించడానికి దిగాడు. ఆ జవాన్ మెల్లగా చెవిలో ఊదాడు– రేపు ఉదయమే ఉపద్రవం జరుగబోతున్నదని. వెంటనే ఆ విద్యార్థి పత్తిపాటి ఇంటికి ఉరికాడు. కోర్టు సెలవులు. ఆయన ఊళ్ళోలేడు. కన్నబిరాన్ దగ్గరికి వెళ్ళి చెప్పాడు. ఆయన గవర్నర్ (అపుడు యాక్టింగ్ గవర్నర్ ఓబుల్‌రెడ్డి) దగ్గరికి వెళ్ళి అడిగాడు. ఆయన తన అసహాయతవ్యక్తం చేసాడు. ఒపిడిఆర్ వాళ్ళు అప్పటికప్పుడు కరపత్రం వేసారు. ఏమయితేనేం ఆ రాత్రికి కోర్టు వాళ్ళ ప్రాణాలు నిలిపింది. మళ్ళీ ఉరి శిక్షల రద్దు ఉద్యమం ప్రారంభమైంది. ఎన్నో ప్రజా సంఘాలు, వృత్తి సంఘాలు, ప్రజాతంత్ర వాదులు కలిసి 'భూమయ్య, కిష్టాగౌడ్ ఉరిశిక్ష రద్దు కమిటీ' ఏర్పడింది. ఈసారి ఉద్యమం దేశవ్యాప్తమయింది. జయప్రకాశ్, ఫెర్నాండెస్, చంద్రశేఖర్‌లు మొదలుకొని పార్లమెంటు సభ్యులు, సుప్రీం కోర్టు న్యాయవాదులు, రిటైరైన న్యాయ మూర్తులు, వివిధ జీవనరంగాల్లో నున్నవాళ్ళు ఉరిశిక్షల రద్దు కోసం ఆందోళన చేసారు. ఒక నెలపదిహేను రోజులు ఏ ఒక్కరోజూ విడుపులేకుండా సభలు, సమావేశాలు అందోళనలూ కొనసాగాయి.[1] జూన్ 25 రాత్రి, జూన్ 26 ఉదయం భూమయ్య కిష్టాగౌడ్‌లు వున్న జెయిలుకు వందల సంఖ్యలో, దేశంలోని వివిధ జెయిళ్ళకు వేలు, పదివేలు, లక్షలసంఖ్యలో ఇందిరా రాజకీయ ప్రత్యర్థులు వెళ్ళవలసి వచ్చింది– లేదా అజ్ఞాతంలోకి వెళ్ళవలసి వచ్చింది. ఒక నిశ్శబ్దమైన నిరసనభావం గుండెలపై ఒక భయంకరమైన ఇనుప గజ్జెల తప్పెట మోగింది.

* * *

75 డిసెంబర్ 1వ తేది ఉదయం వరంగల్ జెయిలు, అనూహ్యంగా జెయిల్లో జవాన్ల కట్టుదిట్టాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. రోజూ చనువుగా మాట్లాడే జవానులు ఆ రోజు సీరియస్‌గా, రిజర్వ్‌డ్‌గా దూరంగా వున్నారు. పత్రికలొచ్చాయి. ఒక్క ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో మాత్రం ఒక పిడుగులాంటివార్త. న్యూఢిల్లీ, డేట్‌లైన్

1. అలాంటి ఒక అపూర్వమైన సమావేశం 75 మే 17న హైదరాబాదు క్లాక్ టవర్ దగ్గర భూమయ్య కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షరద్దు కమిటీ ఏర్పాటు చేసింది. అందులో పాల్గొనని వాళ్ళు ఒక్క అధికార పార్టీవాళ్ళే. ఎమర్జెన్సీలో పోలీసులు కాల్చిచంపిన జంపాల ప్రసాద్‌తో నేను కలిసి పాల్గొన్న ఆఖరి సభ అది.

నవంబర్ 30, మర్నాడు అసలు జరుగనున్న భూమయ్య కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు ఆపవలసిందిగా రాష్ట్రపతికి, ప్రధానికి సిపిఐ ప్రధాన కార్యదర్శి చండ్ర రాజేశ్వరరావు విజ్ఞప్తి చేసినట్లు, ఫలితం ఏమయిందో తెలియదు. విఫలమై వుంటే ఈ పాటికి వాళ్ళను ఉరి తీసేవుంటారు. ఎట్లాతెలియాలి. జెయిలు అధికారుల రౌండ్‌వచ్చింది. ఎప్పుడోకాని రాని సూపరెండెంట్‌కూడ వచ్చాడు. మొత్తం అధికారులు వచ్చారు. 'ముషీరాబాదు జెయిల్లో భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరితీసినట్లు మీకేమయినా తెలిసిందా!' అని అడిగాము. 'లేదు' అని ముక్తసరి జవాబు. పత్రికల ద్వారా, రేడియో ద్వారాకూడ మాకుతెలియని ఎన్నోవిషయాలు ఎంతో ఆతురతతో పరుగెత్తుకొచ్చి మాకు చెప్పే ఒక జెయిలు అధికారి[2] కూడ ఆరోజు మౌనంగా వున్నాడు. రౌండ్‌వెళ్ళిపోతుంటే అందరికన్న వెనుకవున్న ఆయనను మెల్లగా అడిగాము 'నిజంచెప్పండి, మీకేమీ తెలియదా!' తెలియదన్నట్లు తల అడ్డంగా తిప్పి వెంటనే మొహం తిప్పుకొని వెళ్ళిపోయాడు. ఆయన మొహంలో విషాదం కనిపిస్తూనే వుంది. మాకు అనుమానంగానే వుంది. వరంగల్ జెయిల్లోనే నక్సలైట్ బ్యారక్‌లో ఖయిదీలుగా వున్న బర్ల యాదగిరి రాజు మొదలయినవారు ఏదో కేసుకోసం హైదరాబాదుకు వెళ్ళి వచ్చి తెచ్చారు వార్త "వాళ్ళను డిసెంబర్ 1 ఉదయం ఉరితీసారు."

నాలుగు సంవత్సరాలు ఉరి కొట్లలో ఏరోజుకారోజు మృత్యు ఆహ్వానం కోసం నిరీక్షిస్తూ, రెండుమార్లు మృత్యు ముఖంలోకి వెళ్ళికూడ మళ్ళీ బ్రతికిన కామ్రేడ్స్ ఉరిశిక్షలను తప్పించలేక పోయాం. ఇది ప్రజాతంత్ర శక్తులకు బాధా కరమైన విషయమే. కాని ఈ ఇద్దరు కామ్రేడ్స్ విషయంలో ఒక్క మాట మాత్రం చెప్పగలను. ఏమర్జెన్సీ లేకపోతే ఇందిరా వెంగళరావు క్రూర పాలకవర్గం ఈ పిరికిపనిని ఇంత నిస్సిగ్గుగా చేసివుండేదికాదు.[3] అయితే అందాకా ఈ సమస్య ఎందుకు నానింది అంటే మాత్రం అందులో నా బాధ్యత, నీ బాధ్యత, ప్రజాతంత్రవాదులందరి బాధ్యత వుందని తలదించుకుంటాను.

– వరవరరావు

---

2. ఇతని పేరిప్పుడు దాచనక్కర్లేదు. జెయిలు అధికారుల ముఖ్యంగా ఒక జెయిలర్ దౌష్ట్యానికి గురయి ఎమర్జెన్సీలో చాల ఇబ్బందులు పడ్డాడు. ఎమర్జెన్సీలోనే గుండె ఆగి చనిపోయాడని తర్వాత తెలిసింది. యువకుడు. ఆయనకు చిరునవ్వులాంటి చిన్నపిల్లలు, ఆయనపేరు శ్రీ శౌరయ్య.

3. ఈ వ్యాసం 77 నవంబర్‌లో రాయబడింది. అప్పుడీ మాట రాయగలిగాను కాని అంతకన్నా నిస్సిగ్గుగా మొరార్జీ-ఎంజీఆర్ ప్రభుత్వాలు కృష్ణన్‌చెట్టిని ఉరి తీసాక ఏమో ఎమర్జెన్సీ లేకున్నా ఇది ఆపగలిగామా అని ఆలోచనలోపడ్డాను. అయితే భూమయ్య, కిష్టాగౌడ్‌ల విషయంలో జరిగిన ప్రజాందోళనతో పోల్చినపుడు కృష్ణన్‌చెట్టి పేరు అసలెవరూ వినలేదు.

## "దేనికోసం...."

ఎ. యస్. ఆర్.

మండుటెండల్లో, వడగాడ్పుల్లో
మాడుతూ, కమిలిపోతూ
రక్తాన్ని నీళ్ళుగామార్చి
కష్టించు కష్టజీవి; దేనికోసం?....

వచ్చిరాని వేతనాలతో
సంతృప్తిని చూపలేక
సతమతమై నలుగుతూ
గతిలేక పనిలోచేరు ఉద్యోగి;
దేనికోసం?....

సిగ్గును, శీలాన్ని, త్యజించి
నిందలను నిగ్రహించుకోలేక
కృంగి కృషించి పోవుచు
వేశ్యవాడల చేరుపడతులు;
దేనికోసం?....

చేద్దామంటె పనిపాటలు దొరక్క
తిందామంటె మాడైనా లేక
భిక్షాటనే శ్రీరామరక్షగా
యాచించే యాచకుడు; దేనికోసం?....

మానవతాభావాన్ని మంటగల్పి
సమతాభావానికి సమాధిగట్టి
దగా, మోసాలకు ఒడిగట్టె
గుంట నక్కల్లాంటి నాయకులు;
దేనికోసం?....

సామాన్యుని శ్రేయస్సు కోసమని
రంకు రాజకీయాలు చాటుతూ
రాజ్యమనే రథాన్ని నడుపు
నంగనాచి ప్రభుత్వం; దేనికోసం?....

ఆకలితో, బాధలతో, రోగగ్రస్తమై
కుళ్ళి కంపు గొడుతున్న ఈ సమాజాన్ని
సాయుధంగా, సాహసంతో
శస్త్ర చికిత్స చేయడమే;
పరిష్కారం....

[అమరుడు కామ్రేడ్ సుధాకర్ వరంగల్, దేశాయిపేట నివాసి. గ్రేన్ మార్కెట్‌లో చాలా చిన్న ఉద్యోగి. అయన నిజమైన వర్గచైతన్యంతో పోరాట పథంలోకి వచ్చినవాడు. పోరాటంలోకి రావడానికి ముందు జీవితంలో, ముఖ్యంగా స్వల్పాదాయవర్గాల జీవితంలో వుండే ఒడిదుడుకుల్ని స్వయంగా అనుభవించాడు. ఆ అనుభవాన్ని కర్మ అని సరిపెట్టుకోక వాస్తవమైన కారణాలకోసం అన్వేషించి పరిష్కారాన్ని కనుగొన్నాడు. అతను పోరాటంలోకి రావడానికి కొంతకాలం ముందు రాసిన ఈ గేయం అతన్ని ప్రభావితం చేసిన, అనుభవించిన కొన్ని వాస్తవ పరిస్థితుల్ని ప్రతిబింబిస్తుంది. దీని రచనాకాలం, 1973 ప్రారంభంలో.]

## ఊకోము

వడ్డెపల్లి సుధాకర్

యింకెన్ని దినాల్ సొంచాయిస్తమ్
అప్ మల్ల మేంఖీ పల్టాయిస్తమ్
ఫ్యాక్టరీ దంగల్లల్ల మిషిన్‌లతోని
కుస్తీలు పట్టి మా కీల్లన్ని సర్కాంచినయ్
మేము యింత మేనత్ చేసిన ఖీ
మా సేట్లకు జరఖీ యిమానంలేదు
మా ఖట్వాడ బరాబర్ చెయ్యరు
ఆల్లకేమొ ఒక్కొక్కన్కి,
రెండేసి జువ్వాఖానలు
రెండెసి షరాబ్‌ఖానలు
రెండెసి బీబీలూ
రెండెసి రండీలూ.
మల్ల మాకు సుత ఉన్నయ్,
రెండెసి వంజరి బాకీలు
రెండెసి క్యాంటీన్ టికెట్లు
రెండెసి బన్ రొట్టెలు
రెండెసి అండీలు.
మా యిండ్లల్లకెల్లి,
బట్టలు బాసండ్లు
గిర్వీహట్‌ల షరికైనయ్
మా వంట్లల్లకెల్లి,
రక్తమంతా మిషిన్‌లల్లకు
ఆయిల్‌గా పోతోంది.
మా పెయి మీని కూరంతా
ఆ పక్కా ఛెక్కా గాళ్ళ
ఆ పౌనె అల్‌గాళ్ళ
ఆ బట్టె బాజ్‌గాళ్ళ
ఆ ఖాద్‌ఖావ్‌గాళ్ళ,
పండ్ల కింద ఖవాబ్ ఖోస్తాలై తానయ్.
యూనియన్ లీడర్లు సుత
మేనెజ్‌మెంట్ చమ్చలెనైరి
వాళ్ళ చేతుల పెద్దపెద్ద దాదాలున్నరు
ఆల్లకెమొ సారా దుకాన్లల్ల ఖాతలున్నయ్.
మేం జర కడగ్గ మాట్లాడ్తె
మా మీన రువాబ్ కసాయిస్తరు
మా మీనికి బటన్ చాకులు దీస్తరు
దిన్ దివాలె మా మీన హమ్‌ల చేస్తరు
అందుకే మా లేబర్ మొత్తం మిలాయి
స్తున్నం
యింకెన్ని దినాల్ సొంచాయిస్తమ్-
అప్ పల్ల మేంఖీ పల్టాయిస్తున్నం

---

## రహదారి

ఎన్, కె.

నీ దారిలో నడుస్తున్నందుకు గర్వంగా
వున్నది
నీ దారి రహదారి కాదు
రహదారి కోసం దారి కాస్తున్న పాడివి
నువ్వు
అశేష ప్రజానీకం మురికిలో బతుకు
తున్నది
మురికిగా బతుకడం లేదు
అసంఖ్యాకమైన జనబాహుళ్యాన్ని
పేవ్‌మెంట్ల బురద గుంటల్లోకి నెట్టి
దర్జా దర్బారుల్లోకి దార్లు తీర్చుకున్న
దోపిడీ దార్లు నీ దార్లు కావు

జనం దారి నీ దారి

జనం బతుకడం లేదు
లేదు జనాన్ని బతుకనివ్వడం లేదు
నాగేటి దారుల్లో నాగుబాము దొర
నెత్తుర్లను వెన్నెలుగా దాచుకునే మర
జనాన్ని చావనివ్వడం లేదు
జనాన్ని బతుకనివ్వడం లేదు

☆

'నిన్ను చంపేసినారు
పోలీసు లాకప్‌లోనో
ఎదురు దాడి కుట్రలోనో
ఉరికంబం చట్టంలోనో
నిన్ను చంపేసినారు'

నిశ్శబ్దంగా విన్న జనం
నిశ్శబ్దంగా పని చేసుకుంటూనే వున్నది
తీరిగ్గా తిని తీరిగ్గా ఏడ్చే
తీరిక లేని జనం
ప్రతి కదలిక వెనుకా
నువు బతికి వుండడం విన్నాను
ఆ గుండె చప్పుళ్ళలో నా గుండె పెట్టి
అక్కడి కన్నీళ్ళు విన్నాను

పగతో కోపంతో ఎరుపెక్కిన కన్నీళ్ళు
ప్రతీకారం ప్రాణంగా ఉబికిన కన్నీళ్ళు
వ్యక్తికాదు కర్తవ్యం ముఖ్యమన్న కన్నీళ్ళు
ఆత్మీయత కామ్రేడై కురిసిన త్యాగాల పూలు
ఎత్తిన పిడికిళ్ళైన కన్నీళ్ళు
శత్రువును తాకి అణువుగా పేలిన కన్నీళ్ళు
నిశ్శబ్దం మొదలు నరికిన చెట్టుకాదు
నిశ్శబ్దం అందని జీవితపు గుట్టు.

☆

కురిసిన హృదయాకాశం వెనుక సూర్యుడు
జల బిందువులుగా రాలి నేలమీద సూర్యుడై
ప్రవహించి ప్రవహించి జనసముద్రంలో సూర్యుడై
విశ్వామంతా నిండుకుంటాడు.

☆

నీ దారిలో నడుస్తున్నందుకు గర్వంగా వున్నది.

---

## పులి బొమ్మ

రేడియమ్

తూర్పు వాకిలికి
తెర గట్టాలనుకొనేవాడు..
కన్నీళ్ళ జడి వానకు
సంతోషంగా నాలుక తడుపుకునేవాడు-
నెత్తురు మరిగిన పులి.

కాంతి కత్తులకు
తెర చిరుగుతుంది.
వాన వడికి
నాలుక తెగుతుంది.
పులి నేలకు ఒరుగుతుంది.

## ఈ చలికాలం

ఈ చలికాలం
కవిత్వపు పంట నుండి
మెట్ట పంటల భూముల్లోకి
పారిపోవాలనుకుంటున్నాను — రెండు చేతుల్లో పారతో
ఎందుకంటే అక్కడ నిజమైన సృష్టి వుంటుంది
బహుశా అక్కడ
రక్తం వొడిసే శ్రమలో, బురదలో
సృష్టి సారాన్ని నేను తెలుసుకుంటాను-

ఈ చలికాలం
కవిత్వపు పంట నాకొద్దు
మరింకేదో కావాలి
మెట్టపొలాల్లో — మళ్ళీ నిన్ను ప్రేమిస్తూ

బెంగాలీ మూలం: పార్థబెనర్జీ
(జగన్నాథ్ గుహ ఇంగ్లీషు అనువాదానికి తెలుగు)

---

# కుంపటి

అందుగుల మొండయ్య

## 1

ఉసిల్లపుట్ట బెదిరినట్టు– ఎటు సూసిన జనం....

పెడీపెడీన కేకలు– అరుపులు....

"దున్నేవాడిదే భూమి"

"రైతుకూలి సంగం వర్ధిల్లాలె"

"దొరల జులుం నశించాలె"

"ఎట్టి పనులు రద్దుగావాలె"

అంకరుమాల్లు జుట్టుకొని బరికాల్లతోటి రైతులు– పెయికంగిలేని దుబ్బనిండిన మొఖాలతోటి రైతుకూలీలు– ఏడి పనులాన్నే ఆపచ్చిన పనులోల్లు– వాడలు దద్దరిల్లేటట్టు మొగులు ముట్ట కేకలేసుకుంట– మెడనరాలుబ్బంగ పాటలు పాడుకుంట– నడుత్తండ్రు.

ఎర్రజండాలు రెపరెపలాడ్తన్నయ్– అళ్ళ కండ్లల్ల ఎర్రజీరలు కదులుతన్నయ్– ఎర్రజెండాలమీద అక్కరబిక్కరి దించిన సుత్తికొడువళ్ళు....

ఊరేగింపు తోటట్టుగ తలలు వేలాడేసుకొని అడుగేసుడే బమ్మ కట్టమయినట్టు, సేసుకున్న కర్మానికి సెరిగడిసేపనే రీతిల, ఏ సందుల ఏం ముంచుక రాగలదనే బుగులుతోటి జిడ్డు మొఖాలతోటి ఊక్కుంట పోలీసోల్లు నడుత్తండ్రు.

ఊరేగింపు వాడవాడలు దిరిగి దుకానదార్ల తలలు దిమ్మెక్కేటట్టు కేకలుబెట్టి– మైదానంల కచ్చింది.

వాసపు కొయ్యలతో గట్టిన స్టేజీమీద ఎవలో కంచుకంఠంతోని ఉపన్యాసం ఇత్తండు.

"ఓరి నీయవ్వ గిట్లుంటదని మాకు ముందుగా లెందుకు సెప్పలే– ఎర్రజండలు లేక తల గొట్టేసినట్టయ్యింది" ఓ పెద్దన్న దుబ్బల కూలబడి అన్నడు.

"మరోక్కపారికి తెచ్చుకుందాం లేయే" ఇంకో పెద్దన్న....

"గల్లెట్లయిద్ది.... ?"

మీటింగుల గుసగుసలు....

ఇంకోకాడ అయితారప్పేట రైతులు– రైతుకూలీలు కూకున్నరు. అళ్ళ కిదంతేందో కొత్తగనిపిత్తంది.

అళ్ళ ఊరుమీనికెళ్ళి రంగపురం రైతులు రాంగ అళ్ళతోని కూడచ్చింద్రు.

"ఔనే భీమన్న మనూరి దొరోడు లంజకొడుకు లావు సెల్లిచ్చుకుంటండు గాదే!"

"సిన్నంగంటన్నవా! వానసొంటి బద్దుమాషి దునియల లేడు- ఎట్ల బుట్టిండో పాపపు లంజకొడుకు- వానవ్వ- మనూల్లె ఏ కోడి పుంజు గూతబట్టిన ఆనింటికే బోవాల్నాయె."

"సెడి సెల్లిచ్చుకున్నోడు సెర్లు కుంటలు బట్టి ఉరుకాలె...."

భీమయ్య అంక రుమాలు సదురుకున్నడు.

"ఏవూరు మంది పెద్దన్నా?" రంగపురం రామేశం అడిగిండు.

"అయితారప్పేట...."

"సంగతేందోంట...."

"సంగతేమున్నది.... ఏడ సూసినా ఏడే మానుకలు- మా వూళ్ళే మాదండి మాదెరసోదోడున్నడు- ఇరుకనియ్యడు కొరుకనియ్యడు- ఊళ్ళె భూములన్ని ముడ్డి కిందేసుకొని మీసాలు దిద్దుతండు- ఆనితోని మాలావు సావచ్చింది."

"వానవ్వ గొడ్లగోసే దొరోడు- వాని సందాల వాడుంటే బాగనే ఉండు- ఆడు ఎర్రి కుక్కసొంటోడు- నడుసుకుంట నడుసుకుంటనే మెలుగుల్ తప్పదీత్తడు- అడుగు దీసి అడుగేసేటాల్లకు ఎవని గుడిసెకో ఉగ్గం బెడ్తడు- గొడ్డుబర్లకు బంధాల్ బోసి పాలుబిండే రకం. మిలమిల సూడంగ నిరుడు గీ ఉద్దేడు నలుగురిని ఊళ్ళె నుంచి ఎల్లగొట్టిండు."

"సైసు.... సైసు...." భీమయ్య.

"అంతలావు మొగోడా!"

'ఓ నీ బాంచెనాతే ఏం జెప్పవశం.... నీ కాళ్లమొక్కుత ఆనికింద నలుభై మంది కారు దున్నపోతుల సొంటోల్లున్నరు. లొట్లకులొట్లు తాగిత్తడు. తాగ్రంటె వాళ్లింట్ల పీనెల్ల-ఇగ ఆళ్లకు అద్దుపద్దులేదు.' భీమయ్య పక్కకు కూకున్న ముక్కు పోగు ముత్తవ్వ అందుకున్నది.

మీటింగుల ఎవలో పాటపాడుతండు.

"గదినుండి, అటెన్క తీరు పాటంగ ముచ్చెట్లు బెట్టుకునేరు...."
ఎవలో గునిసిండ్రు.

రంగపురపు రామేశం భీమయ్య దగ్గెరికి జరిగిండు.

"మరి గట్ల ఆడు సేత్తంటె ఊళ్లనోల్లంత ఏంజేసిండ్రు"

"ఏంజేత్తం....?"

"అందరొక్కటయితె...."

"మా అయితంగని రేపు మంచే జరుగుతది. సెడ్డే జరుగుతది. జర మాట సాయానికన్న ఎవలన్న ఎనుకుండద్దా?"

"ఊళ్లే జరంత ఉన్నోళ్లు గిన్నోళ్లు ఎట్లుంటరు. దొరపట్టేనా మీ పట్టా?"

"ఆనికి అందరొక్కచే- ఎవలను ఇడిసి పెట్టలే- అందరిని దొరికిన కాడికి బరుక్కున్నడు. ఓ! ఏంజెప్పాలే-ఆడుసేసిన పాపపు పనులు-కోడి లేంది ముద్దె త్తడు. గ కోడి పుక్యానికే రావాలే- బరండి కీస లేంది బజారెల్లడు. గ బరండి కీసకు జెబుల కొత్తలు బెట్టద్దు. నాత్రయ్యిందంటె కొత్తపోరి గావాలె-అయ్యా! ఏం జెప్పాలే సెప్పు కుంటె మానం బోతది-సెప్పకుంటె పానం బోతది....ఎంతకని....సీతల్లి బతుకవ్వ.... ఆడికి, ఊళ్లోల్లందరం పోలీసోల్ల సుట్టు కాలుకు బలుపం గట్టకుంట దిర్గినమ్. ఆడికి పోతే అదేతంతు- సుట్టమయి పోతే దయ్యమయి పట్టిసట్టు- 'లావ్....లావ్' మని పాములు తేళ్ళు బారిచ్చిరి. ఏడికి బొయిన ఏడే మానుకలు మా కర్మం గిట్లున్నదని కడుపుల మంట కడుపుల్నే కుక్కుకున్నం. సుట్టు పక్కల గిట్లయితందంటె, గీదే మున్నదోనని గీడికురికచ్చినమ్....

"గిదంత సూత్తంటే ఏమని పిత్తంది?"

"గిప్పటికి మన కట్టసుకం ఇనే మొనగాళ్లు బయిలెల్లిండ్రని పిత్తంది."

రాయేశం లేసి నిలబడి "నాతో రమ్మని" సైగ చేసిండు. భీమయ్య ముడ్డికింది పంచె దులుపుకొని రాయేశం ఎంట బడ్డడు. అయినెనుక అయిదారుగురు రైతులు నడిసిండ్రు. స్టేజీ దగ్గెరికి తీసుక పోయిండు. ఎవలనో పిలుసుకచ్చిండు....సానాసేపు మాట్లాడిండ్లు.

"తమరు రాకుంటె కలువది." భీమయ్య మొక్కిండు.

"నే నత్తపాయే....భీమన్న...." రాయేశం భీమయ్య ఎన్ను నరిసిండు.

## 2

ఊడల మర్రికింద సిక్కటి సీకటి పేరుకున్నది.

సీకట్ల మర్రికింద కూరుకుపట్లు పడుకుంట యాభయి మంది గుసగుస లాడ్తండ్రు.... ఎలుగురాసిన గొంతికెలతోటి ఏందేందో సెప్పుకుంటుండ్రు-

నడిజాము తిరిగి పోయింది. దూరంగ ఊళ్లె కరంటు బుగ్గలు కొరివి దయ్యాల తీర్గ ఎల్గుతన్నయ్.

"ఏమాయె భీమప్ప పెద్ద పోకిల్లు గొడ్తివి- నడిజాము తిరిగి పోనచ్చె- అత్తనన్నోళ్లు రాకపోయిరి- ఊళ్లె ఉలిలయి పోయింది. అట్టి బొక్కలకు కొండ్రిగాదు

దెబ్బలు తిన్నట్టయ్యింది. మందిల పిత్తైటోదెవడన్న మనందరి పేర్లు దొర కాడ ఊదుంటడు. రేపు దొర ఒక్కొక్కన్ని బంకుల్లకు పిలిసి మిలమిల సూడంగ తోలు పికుల గొడ్తడు.'' పెంటయ్య లేసి నిలబడ్డడు.

భీమయ్య భీరిపోయి ముర్రికొరిగిండు

"అదిగాదుగని- నాకెరుక లేకడుగుత- అంతలావు దమ్ములుంటే నీ యక్క పీక్క పోయిందేంది? కూడినోల్లం ఎట్టయిన కూడినం. బదునామయినోల్లం బదునామయితిమి. మనమే గిది గుర్రం గిది మైదాన మనుకుంటెగాదా! నా లంజెపియి మల్లమల్ల తల్లి కడుపుల బుట్టబోతమా!"

"రోజు సచ్చే సావేనాయె- రోజు సచ్చెటోనికి ఎవదేడుత్తడు. కానియ్యండ్లి...."

"ఇదీ మంచి మాటే...."

లచ్చయ్య ఏడేడ తను ఏమేమి సూసింది సెప్పుకచ్చిండు ఇలెవరిసె బెట్టి.

"కట్టంబె- కట్టే.... రేపు అందరం దొరింటికి బోదాం. మంచి మాటకు పరంపోగులు దున్ను కుంటమని అడుగుదాం- పాలేరోల్లు, సాకలోడు, మంగలోడు అంత బందు.... పాలేరోల్లకు అయిదు నూర్లు అడ్డి లేకుంటియ్యాలె- అయిదు గుంచాల జొండ్లు నెల జీతం గొలువాలె- అయిదు గిద్దెల పెట్టుబడి- గొంగడి సెప్పులు- లంజ కొడుక లవుడికొడుకని ఎగిరిండో- అందరం పనిబందు...."

"ఇంటడు సరేసరి- ఇనడు సూత్తాం- నాగండ్లకు ఎవడడ్డమత్తడో సూత్తాం."

అంతట్లకే నలుగురు మనుషులచ్చిండ్రు- రామేశంను సూసి భీమయ్య సంబుర పడ్డడు

"కాలినడకన అచ్చెటాల్లకు కూసంత ఆలిస్యమయ్యింది" రామేశం.

రామేశం సానాసేపు సెప్పుకచ్చిండు- ఆఖరుగ 'సంఘం' బెట్టుకోవాల్నన్నడు.

సంఘం ఏర్పడ్డది- భీమయ్య సంఘం పెద్దయ్యిండు.

ఇగ లేవబోదామనేటాల్లకే ఈదుల్లనుంచి 'ఝుయ్యి ఝుయ్యి'న ఈలలినచ్చినయ్.

కండ్లుమూసి తెరిసెటాల్లకే దుడ్లుబట్టుకొని దొర మనుషులు రైతులమీన బడ్డరు- పెఢీపెఢీన దెబ్బలు- మొత్తుకోల్లు- లొల్లి- ఎటోల్లటురికిండ్లు....

సేతుల్లేమి లేకుంటున్న రైతులు- కూలోల్లు సొదసొద నెత్తుర్లు గారంగ ఉరికిండ్లు.

రామేశం, మరో నలుగురు రైతులు దొరికి పోయిండ్లు.

## 3

రామేశం ఎంటచ్చిన ముగ్గురు రైతులు-

"అయితారంపేట దొరోడు ఊరునిండా గుండగాళ్ళను దించి ఊరును కాష్మాల గడ్డ జేసిండు. ఇండ్లల్ల జొచ్చి పిల్లల మేకల సావగొడ్తండ్రు- అళ్ళు మనసొంటి కూటికి లేనోల్లే- అళ్ళిప్పుడు మంటలున్నరు- అడు ఇయ్యల్ల అనూల్లె జేత్తే రేపు మనూల్లల్ల దొరోల్లు తోకలు మిడకొడుతరు- గరీబోల్లకు గరీబోల్లం మజ్జతుబోకుంటె ఇంకెవలు బోతరు."

ఊరూరికి సెప్పిండ్లు....

"ఔ నిచ్చమే...."

"పా.... అంటే పాండ్లి...."

## 4

ఆనాడు నెత్తురు పూసుకొని పొద్దుపొడిసింది-

రంగారావు దొర నెత్తంత సెదిరి, మొఖంమీన సూనెబేరి కుర్సిల పరేషాన్ల కూకున్నడు- తాగి తాగి కండ్లు నిప్పుల తీర్గయినయ్- గుండగాల్లు పట్టుకచ్చిన రైతులను గడీల కొయ్యలు పాతిచ్చి జనుప గిర్ర సేర్లతోటి కట్టేపిచ్చిండు- అళ్ళ పెయ్యంత కమిలి, నెత్తురు కార్తంది.

"లమ్డి కొడుకుల్లాలా.... ఎక్కడిదిరా మీ బలిజం.... కమినిట్ల బలమారా ! పోలీసోల్ల బిలిపిచ్చి తుపాకి సేపిత్త.... కూలి లంజకొడుకుల్లాలా...." దొర మొరిగి మొరిగి ఇంట్లకు నడిసింది.

పక్కీరు సాయెబు అఖరిసారిగ రామేశం దవుడమీన గుద్దిండు.

రామేశం కాండ్రకిచ్చి ఊంచిండు....

"కుక్కా ! ఎప్పటికి మీ కాలముండదిరా ! మా కాలం సుత అత్తది...."

పక్కీరు సాయెబు కిసకిస నవ్వి ఊరవతలి అగు మొఖాన నడిసిండు- కండ్లు మండుతన్నయ్.... "కడుపుల మంట- సారాలేంది ఎల్లేటట్టుగ" లేదనుకుంట.

అంగి నడుత్తనోడు ఎందుకనో నిలుసుండి ముంగటికి సూసిండు- 'యాఅల్లా' అన్నడు- పుట్టగడ్డెక్కి పొద్దుకు సేతులడ్డంబెట్టి సూసిండు- నేల ఈనింది....

మూరెడు మూరెడు పరకల పుల్లలేసుకొని- అంక రుమాలోల్లు, పెయి కంగి లేనోల్లు, పెద్దపెద్ద మీసాలోల్లు, మొఖాలు కడుగుతండ్రు- కొందరు సద్దులు తింటండ్రు- ఉసికె గన్పియ్యకుంట జనం.... ఆడోల్లు సెలిమెలు జల్లుతండ్రు- సేతుల్ల గుతుపలు, గొడ్డండ్లు, ముల్లుగట్టెలు.

పక్కీరు సాయెబుకు పానమెల్లిపోయింది.

ఎనుకకు మర్రిసూడకుంట కాల్లకు లుంగిపేగు తట్టుకోంగ ఉరికిండు- దొర పడారి గోడల కచ్చి ఎగపోసుకుంట నిలుసున్నడు.

దాసిది రాక ఆకిలి ఊడ్వకుంటున్నది- ఈపరకే అలుకు జల్లి ముగ్గుబెట్టేది.

మంగలోడు రాక బంకుల్ల కంజీన ఇంక ఎలుగుతనే ఉన్నది.

కుర్సిల దొర లేడు-

అదే కాళ్ళమీన లోగింట్ల కురికిండు.

దొర పట్టెమంచంల అడ్డదిడ్డంగ పన్నడు- సేతుల బరండి కీసున్నది-

దొర్సాని ఎదురయ్యింది-

"నీ బాంచెన్ ఏవున్నది- దొరను జర లేపుండ్లి...."

పక్కీరు సాయెబు ఎగపోత్తండు.

దొర్సాని ఎగదిగ సూసి ఆడినుంచి ఎల్లిపోయింది.

దొర లేపకుంటనే లేసిండు- సీస పారేసి సికిలేటు ముట్టిచ్చిండు- సొలుక్కుంటనే బంకుల్ల కచ్చిండు.

పక్కీరు సాయెబు సలిజరం గొట్టినోని తీర్గ అనుక్కుంట తను సూసింది చెప్పిండు.

దొర సేతుల సికిలేటు కిందబడ్డది.

"ఉరుకు, అందరిని పిల్సుకరా !"

దొర మేడమీది కురికి తుపాకి లోడుసేసుకున్నడు.

ఎందుకనో తుపాకి సేతులుండంగనే దొర మీసాలదురుతన్నయి- ఎక్కన్నో బుగులు- తుపాకి సేతబట్టుకొని మళ్ళో బరండి కీస మూతికాడ బట్టిండు- కాళ్ళు దేవుడు పూనినట్టుగ అనుకుతన్నయి....

నలుగై మందచ్చేటాల్లకు దొరకు ధైర్నమచ్చింది.

"బోల్లు బొక్క లవుతల పారేసినం.... కనిపిచ్చినోన్నల్ల తన్నినం- ఊరంత ఉచ్చబోసుకుంటంది-" బొందిగాడు దొర మొఖంలకు ఆశగా సూసిండు.

"తొత్తు కొడుకులు రానీయ్- వానవ్వల కుక్కల్ దెం.... పక్కీరు, నువ్వురికి పోలీసోల్లకు జెప్పు- శంకరిగా, సుక్కా.... మీరిద్దరు సెరో తుపాకందుకోండ్రి...." దొర ఏగిరపెట్టిండు.

జనం ఊళ్ళె సొరనే సొచ్చిండ్లు-

"దున్నేటోనిదే భూమి...."

"రంగారావు దౌర్జన్యం నశించాలె...."

"పట్టుకున్న రైతులను విడిచిపెట్టాలె...."

"పరంపోగులు దున్నుకోవాలె...."

"ఎట్టి నాగండ్లు రద్దుగావాలె...."

"తీసుకున్న దండుగులు ఎల్లగక్కాలె...."

పెడీ పెడీన కేకలు.... ఎవలో బొంగురు గొంతోడు "ఏ పొక్క సొచ్చిన ఇడువంరో.... మా రెక్కల కట్టం దోసినోడా! ఎర్రి కుక్కోలె మొరిగినోడా! మే మడిగేదానికి జవాబు చెప్పు" పాట పాడ్తుండు- సానామంది సప్పట్లు గొట్టుకుంట పాటను గొంతెత్తి పాడ్తుండ్రి....

గెఫీ గెఫీన అడుగులు.... కాళ్ళ దుమ్ము ఆకసంలకు లేత్తంది- పోరగండ్లు పిల్లిమొగ్గ లేసుకుంట ముంగట నడుత్తుండ్రు.... ఆడోల్లు శాపనార్థాలు పెట్టుకుంట నడుత్తుండ్రు.

పాయె- అయిపాయె- ఊళ్ళున్న జనానికి పూనకమచ్చింది- కుంటి, గులాపు, ఉన్నోడు, లేనోడు అందరు ఆ మందల కలిసిండ్లు.

ఉత్తెర మట్టోలె ఉరుములు- అసలేరు ఆనోలె ముసురుకున్నరు. దొర బంగుల సుట్టు జనం.... ఎవని మొఖం సూసినా భగభగమండే మంటలే....

"ఎక్కడి జనం? ఎట్ల కూడిండ్రు జనం! సెప్పుకింది సీమల తీర్గ అంచిన నడుమెత్తకుంట పన్జేసే జనాని కెక్కడిదీ బలం?...."

దొరకు పిచ్చిలేసినట్టుగున్నది.... కిటికీ పీకేయాలనుకున్నడు.

జనం అరుపులాగినయ్- కేకలాగినయ్- పాటలాగినయ్- బంగుల మీద మనుషులు జనానికి కన్పిత్తండ్లు.

భీమయ్య మొత్తుకున్నడు....

"ఇగో దొరా! మంచి మాటకు జెప్పుతన్నమ్.... అట్టన్నాయెంగ మావోల్లను బంగులల కట్టేసినవ్.... ఇవ్వార్దనుక మా కొంపలార్సినవ్– పైకం గక్కాలె.... గుంజుకున్న భూములిడిసిపెట్టాలె...."

బంగులల నుంచి సప్పుడులేదు....

"ఊళ్లెనుంచి ఎల్లగొట్టినోల్ల భూములు ఎవరియాల్లకు ఇయ్యాలె"

"ఓరి లంజకొడక నాదగ్గెర దండుగని నెలకోపారి ఓడిచ్చుకుంటివిగాదురా! నోరుమంచిదిగాక నేనన్నాకొద్ది మాట మాటకు నూరంటివిగాదురా! తలెముంత లమ్మితివిగాదురా!" పొట్టిగున్నరైతు గిదగిద పెద్దరువాజల కురికిండు.

ఒక్కొక్కలే.... దొర ఏమేమి సేసిందో సెప్పుతండ్రు. మాటలిన్నాకొద్ది జనం పిడికిల్లు బిగుసుకుంటన్నయ్....

"తూ! నీ పుటుకు గాల.... ఆడిదాన్ని సూత్తే మారేసిసూత్తవు గాదురా...." ఎవలో కడెంబద్దలు తాకిచ్చుకుంట చెప్పింది.

"నీ బంగుల తవ్వి పారేత్తం.... దిగిరా!"

అరుపులు....

ఎవడో రాయిసిరిండు....

సప్పుడులేదు.... రాయి బంకుల పెంకలమీద 'బొక బొక' జారింది.

ఇంకెవడో పెద్దరువాజ పాటకుల పొకిండు.

ఆకిట్ల రక్తాలు కార్తన్న రైతుల జూసి ఆవల దునికిండు.

తుపాకి పేలింది.... లోపలికి దిగిన మనిషి కాలి సీలమండల్ల నుంచి గుండు దూసుకపోయింది.... అట్లనే పట్టుకొని ఉరికి ఒక్కొక్కల కట్లిప్పిండు.

జనంల తర్జన భర్జనలు.... ఎండ ఎక్కిపోతంది.... తిట్లు శాపనార్థాలు....

"నీ తుపాకులు తూటుకొమ్మెలేం జెయ్యయి–" ఎవడో అరిచిండు.

జనం కదిలిండ్లు....

లోపటికి దిగిన మనిషి పాటకులు తెరిసిండు– తుపాకి గుండ్లు ఒళ్ళంత దిగుతనే ఉన్నయ్–

జనం పాటకుల్లకు సొచ్చుకపోయిండ్లు....

తుపాకులు మొరుగుతనే ఉన్నయి....

భీమయ్య ఒరిగిపోయిండు.

ఝుయ్యి ఝుయ్యిన తుపాకి మోగుతనే ఉన్నది.

జనంలో తొక్కిసలాట.... కింద బడేటోల్లు పడ్తనేవున్నరు. ఎవలు ఎనుకకు పోత లేరు.... సేతికందిన రాల్లు రువ్వుతండ్రు.

ఎప్పుడచ్చిండ్లో బర్రుబర్రున జీపుల్ల పోలీసోల్లచ్చిండ్లు.... పోలీసోల్లు సోద్యం సూసుకుంట నిలుసుండంగనే బంగులమీన్నుంచి తుపాకి కాల్పులు జర్గుతనే ఉన్నయ్....

ఆడామె గిదగిద అమీను సాబు జీపుకాడికురికింది.

"అచ్చిండ్లా.... వాడు సూడుండ్లి బాంచెన్ గింత మంది మా మొగోల్ల పిట్టల గాల్సినట్టు కాలుత్తండు.... నీ బాంచెన్ మీ కాడ గా తుపాకులున్నయ్. అల్లకు ఎదురు సెప్పుండ్లి లాకపోతే ఆపుమని సెప్పుండ్లి...."

అమీను సాబు మైకుల "రైతులారా! ప్రశాంతంగా ఉండండి- లేకుంటే కాల్పులు జర్గుతయి...."

"నీ బాంచెన్ తమరు గదే మాటంటరా!" ఇందాకటామె.

అమీను సాబు వినిపిచ్చుకోలె.

"వాన్ని అరెట్టు సెయ్యుండ్రి బాంచెన్- సత్తండ్లు బాంచెన్, సత్తండ్లు-" గొంతికె తెగిపోయెటట్టు అరిచింది.

"రైతులూ ప్రశాంతంగా...." అమీను....

"ఓరి నీ సావు నిర్సావుగాను- నా సీరె గాజులు నువ్వు తొడుక్కోరాదు. గ బట్టలు నాకియ్యి, తుపాకి నాసేతికియ్యి- అన్ని అరెట్టు సేత్తా-" కాండ్రికిచ్చి ఊంచింది.

జనం పోలీసోల్ల దిక్కు తిరిగిండ్రు-

"మీరు ఆనికి మద్దతచ్చిండ్లా...."

"తన్నుండ్రి- ఈల్లు ఆల్ల బంట్లే...."

పోలీసుల తుపాకులు గాలిల మొరిగినయ్.

ఎవలో ఎత్తు బండెక్కిండు.

"మనండ్ల ఒక్కలం మిగులం...."

జనంల అలజడి....

ఎవలో ఏడుత్తండ్లు పేగులు నోట్లెకచ్చేటట్టు-

ఎవలో తిడుతండ్లు గొంతికె తెగిపోయేటట్టు-

ఎవలో....

"అగం.... మండుతంది- నాకో తుపాకి గావాలె- తుపాకి.... సత్తానం.... కాలిపోతన్నం...."

"లంజకొడుకులు" ఒక్క పలుసటి రైతు కారే నెత్తురుతోటి అటిటు ఉరుకు తండు.

మరి కాసేపటికి పొగలుగక్కె- తుపాకుల్ల రైతులు నెత్తుర్లు కారే మొఖాలతోటి అగిపోయిండ్లు- ఏడుపులు ఆకసం ముట్టినయ్.

## 5

తెల్లారి దొరల పేపర్లు మజ్జె పేపర్ల మూలకు వింతవార్త అచ్చొత్తినయ్-

"ఆదివారపేటలో కాల్పులు....

మొన్న సాయుధ దుండగులు శ్రీ రంగారావు వారిమీధ కత్తులు, కటార్లు, గొడ్డండ్లతో దాడి చేశారు- ఆత్మరక్షణార్థం రంగారావుగారు జరిపిన కాల్పుల్లో ఇద్దరికి స్వల్ప గాయాలు తాకినయ్. పోలీసులు హుటాహుటిన ఆ ప్రదేశానికి వెళ్ళి పరిస్థితిని అదుపులోనికి తెచ్చినట్టు నేడిక్కడ ఆలస్యంగా అందిన వార్తలవల్ల తెలుస్తున్నది. శాంతిభద్రతలు నెలకొల్పినందుకు మంత్రి నారాయణరావుగారు పోలీసులను అభినందించారు. ఇప్పుడు పరిస్థితి ప్రశాంతంగా ఉన్నది"

అదేరోజు పేపరు నిండా తాడికాయలంత అక్షరాలతో-

"దేశంలో విద్రోహక చర్యలు నానాటికి పెచ్చరిల్లుతున్నాయి- సంఘ విద్రోహక శక్తులను ప్రభుత్వం ఎంతమాత్రం సహించబోదు-" అని గాంధీగారి జీవిత చరిత్ర ఆవిష్కరించుతూ ముఖ్యమంత్రి గన్నారెడ్డి ప్రకటించారు.

కాని రైతుల్లో అగ్ని రగులుకొంటనే ఉన్నది.

కుంపటి "చిటపట - పటచిట" ఇంకా మండుతనే ఉన్నది.

---

# మానవ జీవితంలో మనస్సు పాత్ర

కొడవటిగంటి కుటుంబరావు

"ఆదర్శాలూ, భావాలూ మనిషిని, ఏజంతువూ చెయ్యని పనులు చెయ్యటానికి ప్రేరేపిస్తాయి.... పాశవిక మానవులతోసహా మనకు తెలిసిన మానవసంఘాలన్నీ బాధాకరమైన ఆచారాలు పాటిస్తూ, తమకు అందుబాటులో ఉన్న సుఖాలను త్యజిస్తాయి" — గోర్డన్ చైల్డ్

జంతువుల నుంచి మనుషులకు మెదడులో కలిగిన పరిణామ ఫలితాన్ని పై వాక్యాలు కొంతవరకు నిరూపిస్తాయి. అయితే ఈ తేడా వెనక అతి ముఖ్యమైన విషయం ఒకటున్నది- అది సామాజిక జీవనం. ఆదర్శాలూ, భావాలూ, ఆచారాలూ సమిష్టి జీవితంలోనే ఉత్పత్తి అయి, తరాల వెంబడి పరిణామవులాయి.

ఇందుకు కారణం భాష- భాష జగత్తులో గల వస్తువులకూ, క్రియలకూ, అభిప్రాయాలకూ సంకేతాలు సరఫరా చేస్తుంది. మాటలు కృత్రిమమైనవి- వాటిని ఆమోదించిన సమాజంలోనే వాటికి అర్థం ఉంటుంది. ఒక భాషవారికి మరొక భాష అయోమయంగా ఉంటుంది. ఏ సమాజం కూడా తనకు నిరుపయోగమైన మాటలు సృష్టించదు. ఏడాదిపొడుగునా మంచులో జీవిస్తూ, తోలు బట్టలు ధరించేవారికి విసనకర్రలు అవసరం ఉండవు- వారి భాషలో ఆ వస్తువుకు మాట అవసరం లేకపోవచ్చు- అలాగే సంఘ జీవనంలో మార్పులు వస్తున్న కొద్దీ కొన్ని పదాలకు స్థానం లేకుండా పోతుంది. అర్థశాస్త్రంలో చెప్పిన అనేక రాజకీయాధికారుల పేర్లు అంతరించాయి; కారణం ఆ అధికారాలు అంతరించడమే. ఏ మేకకూ, పులికీ "దేవుడు, విధి, పుణ్యం, పాపం, కర్మ" లాంటి భావాలు కలగవు. భాషను ఉపయోగించకుండా వీటిని వివరించి, మరొకరికి అర్థమయేటట్టు చెయ్యటం సాధ్యం కాదు. ఇలాంటి మాటలు అన్ని భాషలలోనూ ఉన్నాయి గదా అనవచ్చు- అన్ని భాషల వాళ్ళు ఏదో ఒక సామాజిక పరిణామ దశలో ఈ భావాలు అవసరమని భావించారనుకోవాలి. ఏ యదార్థ వస్తువునూ నిర్దేశించలేని ఈ మాటలు సమాజాలను గుర్తుపట్టటానికి వీలులేకుండా మార్చాయి. బుద్ధుడికీ, క్రీస్తుకూ, మహమ్మదుకూ ముందూ, వెనకా ఉండిన సామాజిక జీవితాల మధ్య తేడాలు చారిత్రికమైనవి. ఇంతటి మార్పులకు ఆధారం శుష్కమైన మాటలేనా అనుకున్నప్పుడు చాలా ఆశ్చర్యం వేస్తుంది. కాని ఆ మాటలు వాస్తవ సామాజికావసరాల నుంచి పుట్టాయని గ్రహించాలి.

అయితే "శుష్క" పదజాలాన్ని సృష్టించి ముందుకు పోయే సమాజం తన అవసరాలు గుర్తించగానే మాటలను సృష్టించుకో లేదు. ఆ మాటలు సృష్టిఅయి ఆ భావాలు సమాజపరంగా మనుషులకు అవగాహన అయేదాకా సమాజం నష్టపోతూనే ఉంటుంది.

ఉదాహరణకు "దొంగతనం" అన్న మాటను తీసుకుందాము. వ్యష్టి అస్తి హక్కులు లేని సంఘాలు ఆ మాటను సృష్టించ లేవు, వింటే అర్థం చేసుకోలేవు. అట్లాగే రాజరికం ఉన్న కాలంలో "ప్రజాస్వామ్యం" అనేమాటకు అర్థం ఉండదు. అన్నిస్వామ్యాలూ రాజువీ, రాజు బావమరిదివీను. ఇవాళ మనం వర్గరహిత సమాజం గురించీ, సమసమాజం గురించీ, సోషలిస్టు వ్యవస్థ గురించీ, కమ్యూనిజం గురించీ మాట్లాడుతున్నాం. ఈమాటలు మానవుడి అవసరం నుంచీ పుట్టిన మాట నిజమేగాని, ఇవి అందరికీ అర్థం అవుతాయని చెప్పటానికి వీలు లేదు. మానవ జాతి భవిష్యత్తు ఈమాటల మీద ఎంత ఆధారపడి ఉన్నదో, ఆభవిష్యత్తు కొన్ని దేశాలలో ఏ విధంగా రూపుపొంది, ప్రజల సమస్యలను— నిరుద్యోగం, ద్రవ్యోల్బణంలాటివి— ఎలా రూపుమాపిందో గ్రహించక పోగా, ఈ మాటలను చూసి బెదిరిపోయే వాళ్లు కూడా ఉన్నారు.

అంతేకాదు. ఈ "శుష్క" పదాలను సామాజిక దోపిడీకి చక్కగా వాడుకుంటు న్నారు. ఒక దశలో తొలి సంఘాలు వృద్ధి పొంది, సాంకేతిక నైపుణ్యం పెంచుకొని సృష్టించిన అదనపు సంపదకు హక్కుదారుగా దేవుడు వచ్చి, బ్రహ్మాండమైన ఆలయా లలో మకాం పెట్టాడు. రాజు తానే దేవుణ్ణి అని ప్రకటించుకుని, సంపద కంతకూ హక్కుదారునన్న తరువాత న్యాయంగా దేవుడితో పని తీరింది. కాని దేవుడు పోలేదు. దోపిడీకి వాడు అవసరమయాడు.

దోపిడీకి అవసరమైన మరో మాట ప్రజాస్వామ్యం. కమ్యూనిజంలో తప్ప నిజమైన ప్రజాస్వామం సాధ్యంకాదు. కాని సంఘ దోపిడీ గాళ్లు "ప్రజాస్వామ్యం"కూ "కమ్యూనిజం"కూ వైషమ్యం ఉన్నట్టు ప్రచారం చేస్తున్నారు.

ఇవన్నీ చరిత్రగతిని నిర్ణయిస్తున్న "శుష్క" పదాలు.

ఇలాటి శుష్క పదాలతో కూడుకున్నవే ఒకనాటి ధర్మశాస్త్రాలూ, ఈనాటి చట్టాలూనూ. వాటిలో చెప్పిన నిషేధాలు సమాజంలో ఉండిన కొన్ని ఆచారాలను బయట పెడతాయి; వాటిని నిషేధించటం సంఘానికి మొత్తంగా గాని, ఒక వర్గానికి గాని లాభం కావచ్చు. "పరస్త్రీతో పోగూడదు" అంటే రెండు విషయాలు స్పష్టం అవు తాయి: వివాహ వ్యవస్థ అమలులో ఉన్నది, కాని దాంపత్య నీతికి భంగం కలుగు తున్నది. అలాగే తాగుడూ, జూదమూ నిషేధించటం జరుగుతుంది. కాని కౌటిల్యుడి అర్థశాస్త్రం నాడు తాగుడూ, పడుపు వృత్తి, జూదమూ, గోమాంసమూ లాటివి చట్ట విరుద్ధం కాదు. వాటి మీద పన్నులూ అవీ వసూలు చేసే ఉద్యోగులు ఉండేవారు.

## జ్ఞానమూ, విజ్ఞానమూ

జ్ఞానమూ, విజ్ఞానమూ అనేవాటికి భాషతోనూ, సమాజంతోనూ, మనస్సుతోనూ ప్రత్యక్ష సంబంధం ఉన్నది. ఇందులో దేని పాత్రను తీసేసినా అవి సాధ్యం కావు- మాట వరసకు, ఆచరణ ద్వారా ఒకరికి తెలిసినది మరొకరికి భాష అవసరం లేకుండా నేర్పవచ్చు- పిల్లి కూనలకు వేటాడటం నేర్పినట్టు. కాని ఇలా చూసి నేర్చుకున్నది జ్ఞానం అనిపించుకోదు- ఎందుకంటే ఆచరణకు సంబంధించిన పరిస్థితులు మారగానే చూసి నేర్చుకున్నది ఎందుకూ పనికిరాకుండా పోతుంది. భాషవల్ల ఆచరణ తాలూకు మూలసూత్రం తెలుస్తుంది. ఈనాడు మతాచారణలన్నీ జ్ఞానశూన్యమైనవే. ఎందుకంటే తంతు జరిపించే పురోహితుడికిగాని, జరిపే గృహస్థుకు గాని తాము ఏది ఎందుకు చేస్తున్నారో తెలీదు. మతాలు మనిషిని జ్ఞానానికి దూరంచేసి, జంతువుగా మార్చేశాయనటానికి ఇంతకంటె మంచి ఉదాహరణ లేదు.

జ్ఞానానికీ, విజ్ఞానానికీ తేడా గుర్తించాలి- జ్ఞానం లోకవృత్తానికి సంబంధించిన పరిజ్ఞానం. ఇది తత్కాలానికీ, తత్ప్రాంతానికీ మాత్రమే చెంది ఉంటుంది. మార్క్సిస్టు పరిభాషలో "సూపర్ స్ట్రక్చర్" అనేదంతా జ్ఞానమే. సమాజం తన మనుగడకు ఎంత జ్ఞానాన్ని ఉపయోగించుకోగలిగితే అంత ఉచ్ఛస్థితిలో ఉంటుంది. ఆ జ్ఞానాన్ని ఎంత వేగంగా సంస్కరించుకోగలిగితే అంత శీఘ్రంగా ముందుకు పోతుంది. భౌతిక ప్రాతిపదికలో జరిగే మార్పులను బట్టి కొంత జ్ఞానం నిరుపయోగమవుతుంది. దాని వల్ల సామాజికులు లాభం పొందలేరు- అలా శిథిలమైన జ్ఞానాన్ని పట్టుకు వేళ్ళాడే సమాజంలో అది మూఢ విశ్వాసాల రూపం ధరిస్తుంది, అజ్ఞానం కూడా అనిపించుకుంటుంది.

విజ్ఞానం ఇలాటిది కాదు- విజ్ఞానాన్ని మనం 'సత్యం' అంటాం. అది కాలానికీ, ప్రదేశానికీ కట్టుబడినది కాదు- కాలం గడిచిన కొద్దీ దాని సమగ్ర రూపం మనిషికి తెలియవస్తూ పోతుంది. జీవితంలో కలిగే మార్పులు విజ్ఞానాన్ని మార్చలేవు. దానికి మెరుగుపెట్టవచ్చు- విజ్ఞానాన్ని శాస్త్రం అన్వేషిస్తుంది.

శాస్త్రజ్ఞానం వర్గాతీతమైనది- సామాజికమైనది. శాస్త్రజ్ఞానాన్ని పెంపొందించే పని ఒక కులానికి గాని, వంశానికి గాని అంటగట్టలేం. దాని పురోగమనానికి ప్రపంచమంతటా కృషి సాగుతున్నది. మనిషి సంఘజీవి అయినది మొదలు శాస్త్రజ్ఞానం అతడికి అడుగడుగునా తోడ్పడింది. అయినా మన పూర్వులు వ్యక్తిని ఉద్ధరించే మతాచారాలకూ, పుణ్యపాపాలకూ, ఊర్ధ్వలోకాలకూ, మోక్షానికీ ప్రాముఖ్యం ఇచ్చి, బళ్ళ

కొద్దీ చెత్త పేర్చి పెట్టారు. ఇవాళ కూడా అవే ఉద్గ్రంధాలు. ఒక కుమ్మరికి గాని, వడ్రంగికి గాని, కమ్మరికిగాని, వ్యవసాయదారుడికి గాని, మరో వృత్తి పనివాడికిగాని పనికివచ్చే గ్రంథం సంస్కృతంలో ఎన్నడూ రాలేదట. మార్క్సిజం శాస్త్రీయం కావటం చేతనే మన మధ్యతరగతివాళ్ళు కూడా దానిపట్ల లక్ష్యం చూపరనుకోవాలి. మార్క్సిస్టు సూత్రాలను మత సూత్రాలలాగే చూసే మార్క్సిస్టులు కూడా మనదేశం లోనే ఎక్కువేమో.

ఒక్కొక్కసారి మనకు విజ్ఞానంగా కనబడేది విజ్ఞానం కాకపోవటం జరుగు తుంది. ఉదాహరణకు, మనం కొత్త చోటికి వెళ్ళి, అక్కడి దిక్కులు తెలుసుకో గోరినప్పుడు, తూర్పు కోసం సూర్యుడు ఉదయించే దిక్కు చూస్తాం. "సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు" అన్నది మనకు సత్యంగా ఉపయోగపడుతుంది. కాని తరిచి చూస్తే "దిక్కు" అన్నది ప్రాంతీయం, సూర్యుడు ఉదయించటం అన్నది పూర్తిగా అబద్ధం। దక్షిణ ధృవాన ఉన్నవాడికి ఉత్తరం తప్ప మరొక దిక్కులేదు. వాడు ఎటు అడుగువేసినా ఉత్తరానికే కదులుతాడు. అంతేకాదు ఒకరికి తూర్పుగా ఉండేది మరొకరికి పడమరగా ఉంటుంది, గ్రామాలమధ్య పొలిమేరల్లాగా. భూమి పరిభ్ర మించేటప్పుడు మనం ఉండే ప్రాంతం సూర్యకాంతిలోకి వస్తే అదే సూర్యుడు ఉద యించటం.

జ్ఞాన విజ్ఞానాలకు తేడా ఉన్నా, సంబంధం కూడా ఉన్నది. సామాజిక జ్ఞానం విజ్ఞానానికి వ్యతిరేకంగా ఉండకూడదు, అంటే సామాజిక జ్ఞానం శాస్త్రీయంగా ఉండాలి– లేకపోతే అజ్ఞానం అవుతుంది. భారీ ఎత్తున ఆహార పదార్థాలు అగ్నికి ఆహుతి చేస్తే తిండి కరువు పోతుందనేది అజ్ఞానం. పార్టీ ఫండ్ పోగు చెయ్యటంలో ఉన్న సౌకర్యం దానిలో ఉంటుందని మాత్రం ఒప్పుకోవచ్చు. అగ్నికి ఆహుతి అయేముందు ఆహారపదార్థాలు పుష్కలంగా కార్యకర్తల చేతికి అందుతాయి, తరవాత ఏమన్నా కానీ।

విజ్ఞానాన్ని అన్వేషించటంలోనూ, జ్ఞానంలో సామాజిక శ్రేయస్సుకు అవసర మైన, అనుగుణమైన మార్పులు నిర్ణయించటంలోనూ, అశాస్త్రీయ దృక్పథాలను ఖండిం చటంలోనూ మానవమేధ నిర్వహించే పాత్రను మార్క్సిస్టులు తక్కువ చేయరాదు. మానవుడు అవలంబించే భావజాలానికి వాడి భౌతిక జీవనం పునాది అయితే, ఆ భౌతిక జీవనంలో పరిణతి సాధించటానికి ఆ భావజాలం తాలూకు నూతన చైతన్యమే పునాది. ఈ విషయానికి కూడా తగిన ప్రాముఖ్యం ఇయ్యకపోతే మార్క్సిస్టులు పాశవిక మాన వుల లాగా ఊహకూ, వాస్తవానికీ తేడా తెలుసుకోలేని స్థితికి దిగజారుతారు.

# దేశం మీవెంట వుంది

ఆట్లూరి రంగారావు

గ్రామాలకు కదలి వెళ్ళి
నినాదాల గొంతు విప్పి
కదం పదం కలిపి పలికి
పాట పాడి మాటలాడి
పల్లె పల్లె లెన్నొ తిరిగి
రైతుకూలి పేదజనుల
హరిజనులను గిరిజనులను
భూస్వామిక వ్యవస్థపై
కదలండని మేల్కొలిపిన
యువజన విద్యార్థులార!
ఇది రచయితలందించే
అభినందన అందుకోండి.

కూలి జనం ప్రేమతోటి
అందించిన గంజి నీళ్ళు
పాయసమని ఆరగించి
జనంతోటి జనంలోనె
కటికనేల నిద్రించీ
భూస్వాముల దొరల గుట్టు
మట్టులన్ని తెలిసికొని
తిరుగుబాటు పాఠాలను
అమరవీర త్యాగాలను
జనులకంత విప్పిచెప్పి
విప్లవ కర్తవ్యంలో

కొత్తదారి తొక్కుతున్న
యువజన విద్యార్థులారా!
ఇది రచయితలందించే
అభినందన అందుకోండి.

మీ పాటకు మీ మాటకు
మీ నినాద తీవ్రతకు
హడలిపోయి పిచ్చెక్కిన
పల్లె రక్కసులు దొరలు
దౌర్జన్యానికి దిగితే
నిబ్బరముగ నిర్భయముగ
చిరునగవుల నిలచిన మిము
జనమే కాపాడుకొంటు
తమ హక్కుల నిలుపుకొంటు
పోరాటం మొదలిడేట్టు
నేర్పుతున్న నేతలార
వీరులార పిల్లలార
విప్లవ విద్యార్థులార!
యువజనమేధావులార!
సాగిపొండి సాగిపొండి
దేశం మీ వెంటఉంది.

[రాడికల్ స్టూడెంట్స్ దళం ములుగు తాలూకా గ్రామాల్లో తిరిగిన విశేషాలు విన్నాక]

నువ్వు ధూళివి
పాదాల కింద నలిగిపోయిన ధూళివి
అదుపు తప్పిన గాలి తోటే
తుఫానుగా మారు
ఎవరి కాళ్ళకింద యిన్నాళ్ళున్నావో
వాళ్ళ కళ్ళల్లో పడు.

— సర్వేశ్వరదయాళ్ సక్సేనా

## చిరుగాలి!

ఒక తల్లి

చల్లనీ చిరుగాలి
పరుగెత్తి రావే
తల్లి వొడిలో చల్లగా
నిదురించే పాపకూ
పిల్లతెమ్మెరకాదు
మల్లెవాసనకాదు
అడవిలో అన్నలా
ఆశయం తెలుపవే ॥అ॥

చిన్నారి పాపాయి
సిరికన్నుల్లోన
వేలచూపులుకాదు
బేలతనమూ కాదు
వాలుచూపు కాదు
వగలెన్నో కాదు
కార్యదీక్షత కనుల
కత్తులై మెరవాలి ॥కా॥

ఎదిగేటి పాపాయి
చదివేటి పాఠాలు
దోపిడీ కథకాదు
దొంగ కథకాదు
బతుకు చీకటిచేసే
తాత నీతులు కావు
రైతన్న గుండెలో
కూలన్న కండలో
చిందేటి రక్తాల విలువలు
అడవిలో అన్నలా
త్యాగాల ఫలితాలు
తెలిపేటి చదువులు
నాపాప చదవాలి
చల్లనీ చిరుగాలి
పరుగు పరుగున వచ్చి
పాపకిది చెప్పవే

---

## తెలిసిపోయిన బాట!

బొల్లిముంత నాగేశ్వరరావు

తూరుపంతా ఎర్రపడ్తది
తెల్లవార్తది – కోడికూస్తది
కాకులన్నీ కేకలెడతయ్
పలుగు తీసుకు పొలముఎల్తాను
కామందా
పనులుసేటం మొదలుపెడ్తాను!

గడ్డతవ్వి గడ్డఏస్తను
మెరకతవ్వి పల్లమేస్తను
సేనుమొత్తం సదునుసేస్తను
సెమటపడ్డే పనులు సేస్తాను
కామందా
శాకిరీతో సిక్కిపోతాను!

కాడిపడతను మేడిపడతను
దున్నపోతుల దుక్కిసేస్తను
ఎండ నిప్పులు సెరుగుతున్నా
దప్పికైనా, ఆకలైనా
రాయిరప్పను ఏరపేస్తాను
కామందా
రేయిపగలూ కట్టపడతాను!

నీరుపెడతను, నాటుఏస్తను
అలుపుమాని కలుపుతీస్తను
కండలన్నీ పిండిసేస్తను

తెలిసిపోయిన బాట ।

పిండి ఏస్తను
పైరుబాగా పెంచివేస్తను
కంకిఏసిన సేనువంకా
కళ్ళనిండా సూసుకుంటాను
కామందా
కరువులేదని మురిసిపోతాను ।

కోతకోస్తను కుప్పఏస్తను
నెత్తురంతా నీరుసేస్తను
నూర్పిడంతా నానెసేస్తను
దాన్నెమంతా పోగుపోస్తాను
కామందా
దిగులులేదని ధైర్యపడతాను ।

పచ్చసెట్టుకు పిడుగులాగా
వచ్చిపడతవ్ ఇంతలో నువ్
అసలు అంటవ్ ఫసలు అంటవ్
అట్నె మించిన వడ్డీఅంటవ్
గౌసుఅంటవ్ కౌలుఅంటవ్
నాకుతెలవని లెక్కలేవో
కేకలెడతా సెప్పుకెల్తవ్

ఏటపొడుగు శాకిరీనీ
ఏసుకుంటవ్ – తీసుకెల్తవ్
ఇంక తీరని అప్పులంటావు
కామందా
వచ్చేపంటకు తీర్చమంటావు ।

అయినదేమో అయ్యెనాక
పలుగువుంది, పారవుంది
కక్కుకొడవలి సేతనుంది
పేదవాళ్ళకు సంగముంది
దున్నెవాడిదె భూమి అనెడి
తిన్నగుండే మాటవుంది
తెలిసిపోయిన బాటవుంది
ఎర్రబడిన తూర్పుతోటి
ఎర్రిబడ్డ కళ్ళతోటి
ఒకేసారి వచ్చిపడతాము
కామందా
వచ్చి భూమిని పట్టుకుంటాము
కామందా
వుచ్చునంతా రాలగొడతాము ।

## పొద్దుపొడిసి బారెడెక్కె....

అల్లం వీరయ్య

జాజిరి జాజిరి జాజిరి జాజ
జాజిరి జాజిరి జాజిరి జాజా ॥జాజిరి॥

లేరో లేరో లేసిరారో
కాసెపూసి కదిలిరారో
కాసేపోసి కదిలివచ్చి
ఎర్రి జండకు సలాముజెయ్యి
ఎర్రిటి బాటల పరుగులు దియ్యి ॥జాజిరి॥

కరీంనగరం జిల్లాలన్న
గుండె గుండె రగిలి రగిలి
కొండకోన మండుతంది
గుండెలున్న మొనగాడా !
పోరుబాటల నిలిచిపోరా । ॥జాజిరి॥

నువ్వుదున్నే భూమినీదె
పండిన పంటపేండ్లు నీదే

పారనీదే పలుగునీదే
కాదన్నోని వంగదియ్యి
లేవకుంట దెబ్బతియ్యి ॥జాజిరి॥

బువ్వలేదు గవ్వలేదు
అందుకోను కుండలేదు
ఉండబోతె గుడిసెలేదు
ఊరుకుంటే ఏమిరాదు
పోరేదుంటే తిరుగేలేదు ॥జాజిరి॥

మంథెనాది తాలుకలన్నా
రామయపల్లె గ్రామంరన్నా
మెతుకుల్లేని మాదిగోళ్ళు
గతికిలేని జీతగాళ్ళు
కలిసిఒక్కటి అయ్యింట్రాట
దొరోనికెదురు తిరిగింట్రాట ॥జాజిరి॥

జగిత్యాల తాలుకాల
బతుకుల్లేని పాలేరోల్లు
మాదిగోళ్ళు మన్నెపోల్లు
భూముల్లేని బీదసాదలు
ఈగల్లాగ దోమల్లాగ
రోజురోజు సచ్చినోల్లు

బతికిసెడ్డ అన్నలంతా
బతికిసెడ్డ అక్కలంతా
రేగిరేగి తిరగబడిరి
పోరుబాటల సాగిపోయిరి ॥జాజిరి॥

లొత్తునూరు గ్రామంలన్నా
బట్టెబాజి లంజకొడుకు
పందిలెక్క బలిసినోడు
సర్కారోని ముద్దుబిడ్డ
పేదసాదల దోసిదోసి
మేడల మిద్దెల గట్టినోడు
ఎదురు తిరిగిన అన్నల్లోన
పోశన్ననే సంపినాడు
నెత్తుటిబాకి మరువకోయి
పద్దుమీద లెక్కరాయి ॥జాజిరి॥

రండి రండి అన్నల్లారా!
రెండి రెండి అక్కల్లారా!
పొద్దుపొడిసి బారెడెక్క
ఎర్రసేన దూరంపాయె
కొసెబోసి కదులురన్నా
కాలులేపి ఉరుకుదాము. ॥జాజిరి॥

---

# బోధకుల కరదీపికలు

సృజన నవంబరు సంచికలో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎన్ ఎస్ ఎస్ ద్వారా అమలు చేయదలచిన వయోజనా విద్యావాచకం గురించి చూసాం.

ఈసారి ఈవాచకాన్ని బోధించడం కొరకు బోధకులకొరకు తయారు చేయబడ్డ 24 కరపత్రాల స్వభావము, ధోరణి యెలాఉన్నాయో చూద్దాం.

'అక్షరాస్యతకు తోడుగా విజ్ఞానం అందించాలన్నది ఈపత్రాల ఉద్దేశ్యం' అని చాల ఉత్తమమైన ఉద్దేశ్యాన్ని వ్యక్తంచేశారు. కాని పరిచయం క్రమంలో అక్షరాస్యతయే జ్ఞానమనే దృష్టిని ఎన్నోచోట్ల వ్యక్తంచేసారు. ఇవి ప్రజాజీవితానికి, సమస్యలకు ఎంతోదూరంగా కేవలం నీతివాచకాల్లాగా, సెర్మన్స్ లాగాఉన్నాయి తప్ప విజ్ఞానం అందించే ఉద్దేశ్యం నిజంగా వుంటేమాత్రం, అది నెరవేరడానికి అనువుగా లేవనే చెప్పాలి.

ఇందులో ఉపాధ్యాయులకు యిచ్చిన సూచనలన్నీ ఇంగ్లీషులో వుండవలసిన అవసరమేమిటో అర్థంకాదు. ఇంగ్లీషురాని ఉపాధ్యాయులు తెలుగు వయోజనులకు తెలుగు అక్షరాలు, చదువు నేర్పకూడదా? లేక వయోజన విద్య తలపెట్టిన ఎన్. ఎస్. ఎస్ కాలేజ్ టీచర్లకు, తెలుగు చెప్పగలవారికి సూచనలు తెలుగులో అర్థంకావా? ఈ కరపత్రాల్లోవున్న పద్ధతుల్లో పరిచయాలు చేస్తే ఎన్నిప్రశ్నలు వస్తాయో ఊహించవలసిందే. ఉదాహరణకు : 'పశువులకు టీకాలు వేయించాలి' అంటే పశువులేలేని వయోజనులు ఏమడుగుతారో ఊహించండి.

ఇల్లు: 'ఇల్లునుచూసి ఇల్లాలునుచూడు' ఇల్లు చిన్నదైనా శుభ్రంగా వుంచుకునే బాధ్యత రచయిత అలవాటుచొప్పున ఇల్లాలుమీద పెడ్తున్నాడు. దాదాపు సూచనలన్నీ డబ్బుండీ, అన్ని వసతులువుండీ, అన్నీఅమరిన సౌకర్యాలుండీ ఆరోగ్యమూ శుభ్రతా పాటించనట్లుగా చెప్తాడు.

ఐదు: యింకేంకావాలె. ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికలగూర్చి ప్రచారం చేయడానికి మంచిఅవకాశం. మనదేశంలో ఐదు సంవత్సరాల ప్రణాళికలు అమలు జరుపుతున్నారు. మన మేలుకోసం మంచిపనులు చేపడుతున్నారు. ప్రాజెక్టులు నిర్మిస్తున్నారు? యింకేంకావాలి మనకు. ఐనా 'మనంకూడా కష్టపడాలి' ఎందుకూ? ఒకటి రెండు, మూడు అంకెలు నేర్చుకోవడానికి మనం కష్టపడి ఒకటి రెండు మూడు (రంగుల) నాలుగు ఐదు (ప్రణాళికల, ఎన్నికల) అంకెలు నేర్చుకుందాం. వాళ్ళు ప్రాజెక్టుల, ప్రణాళికల, ఎన్నికల మేలుపొందుతారు.

ఐరోపా: (యూరప్)లో ఇంగ్లీషువారు మాత్రమే వుంటారా? వేరే దేశాల, జాతులసంగతి ?

ఓలి: 'కట్నం యిచ్చిన వారినీ తీసుకున్న వారినీ ప్రభుత్వం శిక్షిస్తుంది' ఏ వయోజన ఉపాధ్యాయుడైనా ఈ విషయాన్ని వాళ్ళతో నమ్మించగలడా?

ఓడ: 'ఇంగ్లీషువాళ్ళు ఓడలమీదవచ్చి మనదేశాన్ని గెలిచారు.' ఇది ఓడ పరిచయం. ఇంగ్లీషువాళ్ళు మనదేశానికి ఈస్టిండియా కంపెనీపేరుతో వచ్చారా? ఓడల మీదవచ్చి యుద్ధంచేసి గెలిచారా? '1947లో మనం స్వరాజ్యం సంపాదించుకున్నాం' ఈమాట చెప్పడానికా ఓడగురించి చెప్పేది?. ఇందులో ఓడ నిర్మాణంగురించి, స్వరూపంగురించీ, ఉపయోగం గురించీ ఏంతెలుస్తుంది?

చలి: అనే మాటతో చలికాలం గురించిగానీ, చలిగురించికానీ ఏమీచెప్పకుండా చలిజ్వరంగురించి చెప్తాడు. చలికాలంలోనే చలిజ్వరం వస్తుందనా ఉద్దేశ్యం?

భజన, భయం: లాంటి మాటలు నేర్పుతూ చదువుకుంటే మనకు ధైర్యం వస్తుందని చెప్తే ఎట్లానమ్మడం ?

జండా: మూడురంగుల 'జండా' నడుమచక్రం మనదేశానికి గుర్తా? మన ప్రభుత్వానికిగుర్తా ?

డబ్బు: కష్టపడి డబ్బు సంపాదించుకోవాలి చాలామందికి కష్టపడ్డా డబ్బు రావడంలేదు. కొంతమందికి ఏకష్టంలేకుండా వస్తున్నది అని వయోజనుడడుగుతే ?

నది: 'నదినీరు సముద్రం లోనికి పోతుంది,' పోవలిసిందేనా? 'నదికి అడ్డంగా కట్టకడితే చెరువు,' అట్లాకాని చెరువులు కూడా ఎన్నోవున్నాయి కదా!

పలక: ఎంతసేపూ ఈ వయోజన విద్య ప్రచారం దృష్టిలో అక్షరాస్యతేవిద్య. 'పలకా బలపం చదువుకు బాటలు.' అక్షరం ముక్కరాని విద్యావంతు లెంతమంది లేరు ? అక్షరజ్ఞాను లైన 'విద్యావిహీనులు' ఎందరు లేరు ?

లక్ష్మి: మనకు సంపదలకూ దరిద్రానికీ కూడా దేవతలున్నారు. ఆడపిల్ల లక్ష్మికి సమానం. కనుక వద్దు అనవద్దట, కాని ఆడైనా మగైనా యిద్దరు చాలట– సంపదకు దేవత లైన లక్ష్మిలాంటి ఆడ పిల్లలు యిద్దర్నే ఎందుకు ఎందరినో కంటే ఎంతో సంపదకదా ?

వలస: వలస గురించి చెప్పేప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యవాద దోపిడీ కింద నలిగిన మనకు వలస విధానం గురించేమి చెప్పొద్దా?

శబరి : రామాయణంలో ఒకపాత్రకాదు! 'శ్రీరాముని సేవచేసిన స్త్రీ, అడవిలో వున్నా భక్తురాలేఐంది' అంటే అడవిలోవుంటే దొంగలవుతారనా? వూళ్ళోవున్న వాళ్ళంతా భక్తులవుతారనా? 'కోయ, చెంచు వీరు కొండల్లో అడవుల్లో వుంటారు. మన వంటి మనుషులే.' నిజంగానా!

సరస్వతి : 'చదువులకు దేవత. ఈమె దయఉంటే లక్ష్మికూడ మనవద్దకు వస్తుంది?' కాని రచయితకు అనుమానంగానేవుంది. 'పూజలు చేసినంత మాత్రాన సరి పోదంటున్నాడు,'

ఈ కరపత్రాల్లో: బోలెడంత హాస్యంవుంది. ముళ్ళపూడి వెంకటరమణ పాత్ర లైతే అబ్బ! జోకులువెయ్యకుఅని కడుపుబ్బ నవ్వుతాయి. మలేరియా దోమలైతే మలేరియాలాగానే ఈజోకులు భరించలేక చచ్చిపోతాయి.

ఉదాహరణకు : ఒక భయంకరమైన జోకు :

హక్కు: 'మనందరికి సమానంగా హక్కులున్నాయి. కారణంలేకుండా మన నెవరూ అరెస్టు చేయగూడదు' (ఎవరెందుకు చేస్తారు? పోలీసులు చేస్తారు. చినమెట్టు పల్లి లాంటిచోట్ల భూస్వాములు చేస్తారు.) 'మనకు సభలు చేసుకునే హక్కున్నది.' అంతేనా, మనహక్కుల్ని సాధించు కోవడానికి పోరాడే హక్కులేదా ?

ముఖము : 'ముఖము కళకళలాడాలంటే మనకు మంచి అలవాట్లు వుండాలి.' తిండి అక్కర్లేదా? 'వేళకు భోజనం చేయాలి' దొరకాలిగదా!

ఘంట : వాచకంలో 'గంట'గా పరిచయం చేసింది హనుమంతుని చపల ప్రభావంవల్ల 'ఘంట' ఐనట్లున్నది.

ఛత్రము ' 'ఛత్రపతి శివాజీ గొప్పవీరుడు. తల్లిఅంటే ఎంతో ప్రేమ. గురువు అంటే ఎంతోభక్తి.' ఇందువల్ల గొప్పవీరుడా ?

స్వేచ్ఛ : ఈ కరపత్రాల్లోని మరోజోకు 'మనకు స్వేచ్ఛవున్నది. యిష్టమొచ్చిన వారికి మనఓటు వెయ్యవచ్చు. కనీసం ఆస్వేచ్ఛఐనా వుందని ఈరచయిత గుండె మీద చేయివేసుకొని చెప్పగలడా?

'నేడు ప్రజలే రాజులు మనది ప్రజాస్వామ్యం' ఈప్రజాస్వామ్యంలో 14 సం వత్సరాలలోపు వయసు వారికి నిర్బంధ ఉచిత విద్య ప్రవేశపెట్టి రెండు దశాబ్దాలకు పైగా గడిచిపోయిన తరువాత ఈ రాజులు రాత్రి బడికి వస్తున్నారు.

అర్థము: మనం ఓట్లు ఎందుకు వేస్తున్నాం? ఎవరికి వేస్తున్నాం? యివి మనకు అర్థంకావాలి. చదువుకుంటే మనకి విషయాలు తెలుస్తాయి. చదువుసూ ఓటునుకూడ ఎన్ని అర్థాలకు (ప్రయోజనాలకు) అనర్థాలకు ఉపయోగించు కోవచ్చునో!

ధర: "వస్తువుల ధరలు పెరగకుండా చూచుకోవాలి" ఎవరు? వస్తువుల ధరలు పెరగకుండా చూడడం ప్రభుత్వ బాధ్యతకాదా? "చీకటి బజారు లేకొంటే ధరలు పెరుగుతాయి" చీకటి బజారులెందుకున్నాయసలు? వీటినెవ్వరనుమతిస్తున్నారు? "ధరలు పెంచి అమ్మేవాళ్ళు మనకు శత్రువులు" మరి మన ఈ శత్రువులను "మన" ఈ ప్రభుత్వం ఎందుకు శిక్షించదు? ఇవన్నీ వయోజనులు తెలుసుకోవలసిన అవసరం లేదా! వయోజన విద్య అంతా శుష్క నీతిశాస్త్రమేనా?

ఫలము: పండుఅనే అర్థంలోనేకాని ఫలితంఅనే అర్థంలో చెప్పలేదు.

భయము: "తప్పు చేసినవాడే భయపడతాడు" నిజంగానా? "దొంగలకు పోలీసు లంటే భయం" మరైతే పిల్లలకు పోలీసుల పేరుచెప్పి ఎందుకు భయపెడుతున్నట్టు! ప్రజలెందుకు పోలీసులంటే భయపడుతున్నట్టు! ఎందుకు అసహ్యించుకుంటున్నట్టు?

నక్షత్రము: "ఆకాశంలో చుక్కలకు తోడుగా చంద్రుడు" సైన్సు చదువుకున్న డాక్టరు బాబూరావుగారు అంటున్నారు. ఆకాశం అనే మాట సైన్సులో వుందా "స్పేస్"కు సమానార్థం రోదసి కాదా? "అసలీ చుక్కలకు తోడు చంద్రుడేమిటి" చుక్కలు స్వయంప్రకాశకలు చంద్రుడు ఉపగ్రహము అని వయోజనులకు చెప్పవద్దా.

నగ: నగలు ధరించడం ఒక భాగ్యమట. భాగ్యమున్న వాళ్ళు నగలు ధరిస్తారన్న భౌతిక సత్యాన్ని తలక్రిందులు చేసి చెప్పడం. నగలు ఎందుకొచ్చాయో ఎట్లా వచ్చాయో చారిత్రక పరిశోధన దృష్టి లేకుండా చెప్పడం. సమాజ శాస్త్రి పరిశోధన చేసే వాళ్ళు ఒక వైపు చేతి కడియాలు, దండ కడియాలూ, కాళ్ళ కడియాలూ వంటివి. బానిస చిహ్నాలుగా వచ్చాయని చెపుతున్నారు. మంచి అలవాట్ల గురించి, పరిసరాలు శుభ్రంగా ఉండడం గురించీ, మంచి ఆహారం గురించీ, ఎన్నో చోట్ల చెప్పే ఈ కరపత్రాల్లో ఈ దేశంలో కోట్లాది మంది ప్రజలకు మంచి కాదుగదా అసలాహారమే లేదనే విషయం ఎందుకు లేదో ఆ కారణం చెప్పదు.

పన్నెండవ కరపత్రంలో నగ, పాలు, కిటికి, చీకటి, టీకాలు వంటి మాటల కిచ్చిన వివరణ ఇవన్నీ గ్రామీణ లేదా కార్మిక యువజనులకు చెప్పినట్టుగా లేవు. "నాగరికులకు" చెప్పినట్టుగా వుంది.

కులం: కులంగురించి చెప్పిననీతి బాగానేవుంది. కాని ఈకులవ్యవస్థ ఎందువల్ల వచ్చిందో, ఎట్లాపోతుందో చెప్తే ఎంతోబాగుండేది.

తెలుగు: మనం నేర్చుకుంటున్నది తెలుగుభాష అంటారుకాని మన మాతృభాష తెలుగుభాష అనరేమిటి. లేదా ఆంధ్రప్రదేశ్‌లో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష తెలుగు అనైనా చెప్పాలి గదా

నొసట: "మన కష్టాలకు కారణం "నొసటిరాత" అనుకుంటే లాభంలేదు" బాగానేఉంది. "శ్రమించి పనిచేయాలె" శ్రమించి పనిచేసే ప్రతివానికి ఫలితం దొరుకుతున్నదా? కృషి చేసినవారికే ఫలితం అంటాడు. అది రైతైనాసరే జవానైనాసరే. జవాను ఉద్యోగి కృషిచేయకున్నా ఫలితం పొందవచ్చు. రైతుకు అగ్యారంటీఉందా?

కోడి: "కోడిపందెం మూలాన పల్నాటియుద్ధం జరిగింది" కోడిపందెం ఒక సాకు కావచ్చు కాని పల్నాటియుద్ధానికి కోడిపందెం కారణమని అనగలమా? పందాలను కవ్వించ డానికికూడా వెనక రాజకీయ కారణాలుంటాయి. భారతంలో ఇవీ చూస్తాము కదా.

పౌరుడు: ఇందులో మన హక్కులకన్నా బాధ్యతల గురించి నొక్కిచెప్పడం ఎక్కువగా వుంది. "హక్కులను బాధ్యతలతు మనం అర్థం చేసుకోవాలె" అచ్చుతప్పులు కరపత్రంలోనివే జనమంతా బాధ్యతలు నిర్వహించ కుండా హక్కులే అడుగుతున్నట్లుగా రచయిత చాలా బాధ్యతగా వ్యవహరిస్తున్నాడు!

చెక్క: ఓనమాలు అంకెలు నేర్చుకుంటే చదువు పూర్తవుతుందట.

నిచ్చెన: ఈమాటకు చెప్పిన అర్థంలో ఎన్ఎస్ఏస్ తలపెట్టిన పయోజనవిద్యా స్వభావం అచ్చంగా బయట పడుతుంది. "చదువు నిచ్చెన వంటిది" చదువు అంతస్తులనూ వ్యత్యాసాలనూ సృష్టించే దన్నమాట. సంస్కారాన్ని సమానత్వాన్ని నేర్పేది కాదన్నమాట. మనిషిని మనిషిగా తీర్చి దిద్దడానికి కాదన్నమాట. "మనం పైకిపోవాలంటే చదువు నేర్చుకోవాలి. ఎంతకాలం మనం ఒకరి భుజాలమీద నిలబడతాం" చదువుకొని పయోజనుల భుజాలమీద భారంగా నిలవాలని ఈపైకి పోయామనుకుంటున్న చదువుకున్న మనంకాదా? చదువు లేకపోవడం వల్లనే మనం ఇతరులమీద ఆధారపడుతున్నామా? భారత ప్రభుత్వానికి చదువురాకనేనా ఇతర దేశాలమీద ఆధారపడింది?

పట్టణం: పట్టణం ఎట్లా ఏర్పడిందో చెప్పరు. "పట్టణాల్లో చూడ్డానికి ఎన్నో వింతలుంటాయి. నాగరికత, పరిశ్రమలూ అభివృద్ధి చెందడంవల్ల పట్టణాలు పెరుగుతున్నాయా? వింతలు ఉండడమే పట్టణ స్వభావమా?

బిడ్డ: బిడ్డలను మంచిగా పెంచాలి అనేమాట పయోజనులకు చెప్పకుండా "మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా?" అని పిల్లలను వంచాలనే నీతే ఈబో(బా)ధకుడు ప్రబోధిస్తాడు.

ఎద్దు: పశువులు బాగుంటేనే రైతు బాగుంటాడు. రైతు బాగుండంది పశువులను బాగుంచేదెట్లా?

ఎన్నిక: మన యావంతా ఎంతసేపూ ఓట్లమీదనే ఎన్నికఅంటే ఎంచుకోవడ మని చెప్పొద్దా! "ఓటును అమ్మడం పెద్దతప్పు" కొనడం పెద్దతప్పని చెప్పడమేమిటి. కొనేవాడున్నాడు కనక అమ్మటం అలవాటైంది.

కుమ్మరి: ఊరికి అన్నివృత్తులు అవసరమే. ఎక్కువ తక్కువలేమీలేవు. ఎవరిపని వారు చక్కగా చేసుకోవాలి" తెలివిగా కులాలు వృత్తులకొరకేర్పడ్డయన్నట్టుగా చెపుతున్నాడు.

దాదాపుగా ప్రతిమాటకు వివరణ నీతివాక్యాల్లాగే ఉంటాయి. వాటిగురించి ఎంత రాసినా తక్కువే.

హృదయం: ఇందులో గుండెకు సంబంధించిన వివరణ. గుండెకాక హృదయ మనేది లేదని చెప్పాలిగదా.

అంబేద్కర్: భారత రాజ్యాంగ రచన కధ్యక్షుడని చెప్పవలసిన అవసరంలేదా? నేడు హరిజనుల అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేకంగా శ్రద్ధ వహిస్తున్నది. ఈమాట చెప్పడానికేనా అంబేద్కర్ పరిచయం.

జడ్జి: ఈ కరపత్రాల్లో కొరవడిన హాస్యం చదువుకోవాలంటే ఈ వివరణం బాగుంది.

"మన కన్యాయం జరిగితే విచారించడానికి కోర్టులున్నాయి." కోర్టులు మన హక్కులను రక్షిస్తాయి.

పార్టీ: "ఎన్నికల సమయంలో ఎన్నో పార్టీలుంటాయ" ఎన్నికలు లేనప్పుడు పార్టీలుండవా? రాజకీయ సిద్దాంతాలున్నాయ కనుక పార్టీలున్నాయా? ఎన్నికలున్నవి కనుక పార్టీలున్నాయా?

వార్త: రేడియోలో రోజూ వార్తలొస్తుంటాయి. వాటివల్ల మనకెన్నో కొత్త విషయాలు తెలుస్తాయి. రేడియో వార్తలు కొత్తవిషయాల సంగతలాఉంచు వాస్తవాలు ఎంత చెపుతాయో అందరికీ తెలుసు.

బల్బు: బల్బంటే ఏమిటో చెప్పకుండా కరెంటు ఉపయోగాల గురించి చెపుతారు.

ఆరోగ్యం: "కొన్నిరోగాలు రావడానికి కారణం మన అవక తవక పద్ధతులే" కాని ఎక్కడా అవసరమైన ఆహారమూ, పోషకపదార్థాలు లభించక పోవడమే అని మాత్రం చెప్పదు.

స్వరాజ్యం: "తిలక్, గాంధీ, నెహ్రూవంటి నాయకులు మన స్వాతంత్ర్యం కొరకు జైలుకువెళ్ళారు. మనకు స్వరాజ్యం సంపాదించారు" స్వాతంత్ర్య సంపాదనలో జైలుకు వెళ్ళడమేకాదు, పోలీసుల లాఠీలకు, తూటాలకు, ఉరిశిక్షలకు గురయిన భగత్సింగులాంటి వాళ్ళపాత్ర, అన్నిటికన్నా మించి ప్రజల పాత్రగురించి ప్రజలకేమీ చెప్పక్కర్లేదా? మనకు స్వరాజ్యం మనం సంపాధించుకుంటే వస్తుందా లేక గాంధీ, నెహ్రూలాంటి నాయకులు జైలుకువెళ్ళి అక్కడినుంచి అదేదో వస్తువులాగా తీసుకొని వచ్చారా- పైగా 'స్వరాజ్యం మనజన్మహక్కు' అని గుర్తిస్తూనే ఈజన్మహక్కును జనమే పోరాడి సాధించు కుంటారన్న శాస్త్రీయ అవగాహన లేకుండా గాంధీ నెహ్రూ లలాంటి నాయకులు సంపాదించారన్న ఫ్యూడల్ అవగాహన కనిపిస్తుంది.

పండ్లు: "పండ్లు ఆరోగ్యానికి మంచివి- మన ఆహారంలో పిండి పదార్థాలు, మాంస కృత్తులు, క్రొవ్వు, లవణాలు సరియైన పాళ్ళలో వుండాలి. ఆకుకూరలు, మజ్జిగ పండ్లు- వీటిలో లవణాలు లభిస్తాయి"- ఇలాంటి వాక్యాలు చదువుతూ వుంటే ఈ దేశం లోని నిరుపేద నిరక్షరాస్య వయోజనులకేనా ఈ పాఠాలు అనిపిస్తుంది. అసలు ఈదేశంలో ఎవరు నిరక్షరాస్యులంటే ఎవరికి కడుపునిండా తిండి లేదో వాళ్ళు. వాళ్ళకు పోషక పదార్థాల గురించి చెపుతున్న ఈ డాక్టరు రోగాలకు మూలకారణాలు తెలియని డాక్టర్ల వంటి వాడే.

ప్రదర్శనము: ఈ మాట కేవలం ఎగ్జిబిషన్- వ్యవసాయ ప్రదర్శనలు, పరిశ్రమ ప్రదర్శనలు అనే అర్థంలోనే ఉపయోగించాడు, చూపుట అనే అర్థం లేదా?

నర్సు: వయోజన విద్యావాచకం గురించి చెప్పినపుడు చెప్పినమాటే వాళ్ళు చెప్పాలి. నర్సులంటే స్త్రీయే అయివుండాలని,'ఆఉద్యోగం స్త్రీలకొరకేఅని దృష్టి పురుష దృష్టి Male Nurse, Femal Nurse అనేమాటలు ఈరచయిత వినలేదా? నర్సు అంటే స్త్రీయే అయితీరాలనే నిర్థారణతో చెప్తాడు.

క్లుప్తంగా బోధకుల కొరకు తయారు చేయబడ్డ 24 కరపత్రాల ధోరణియిది. పేర్కొన్నమాటలు ఉదాహరణకొరకు తీసుకున్నవే. ఏవో కొన్నిమాటలు సరిగా వివరించిన సందర్భాలు లేకపోలేదు. కాని మొత్తంమీద శాస్త్రీయ దృక్పథం లేకపోవడం వల్ల, చదువంటే జీవితాలను చదవడమని కాకుండా అక్షరాస్యతఅనే దృక్పథమే, ప్రజలం కావడంవల్ల అన్నిటికన్నా ముఖ్యంగా గ్రామీణ జీవితంలోని భూస్వామ్య సంబంధాలు, పట్టణాల్లోని మురికిపేటల్లోని కార్మిక జీవితాల గురించిన అవగాహన లేక పోవడంవల్ల, నిరక్షరాస్యులైన వయోజనుల జీవనాడిని పట్టుకోవడంలో ఈడాక్టరు పూర్తిగా విఫలమయ్యాడు. ఈ'వైద్య' (విద్య) విధానమలాంటిది.

## భావవాదం

ఉపనిషత్తులనాటికి వర్ణవ్యవస్థ అవతరించింది. బ్రాహ్మణ, క్షత్రియవర్ణాలు పాలక వర్గంగా రూపొంది, 'ద్విజత్వాన్ని' పొందగలిగాయి. ద్విజులకు మాత్రమే వేదాలను అధ్యయనంచేసే అధికారం వచ్చింది. ఆత్మజ్ఞానానికి వారికే యోగ్యతకలిగింది. ఈ వర్ణాలు 'వృద్ధి' అనబడే కృషిలో పాల్గొనేవికావు వేదాలకూ వృద్ధికీ పొత్తేలేదని ఆతర్వాతి ధర్మశాస్త్రకారులన్నారు కూడా. కిందివర్ణాల కాయకష్టంవల్ల తమకు చేకూరిన తీరుబాటును వీలుచేసుకుని, పైవర్ణాలు భౌతిక ప్రపంచాన్నే చిన్నచూపు చూస్తూ, యీ ప్రపంచానికి సంబంధించిన 'వ్యవహారజ్ఞానం' జ్ఞానమేకాదన్నట్టూ, ఆధ్యాత్మిక జ్ఞానమే జ్ఞానమైనట్టూ భావించసాగాయి. 'శుద్ధ' జ్ఞానంకోసం పరుగులు తీయసాగాయి. ఇలా, ఆచరణతో సంబంధంలేని సిద్ధాంతం రూపొందింది.

ఋగ్వేదం తొలిభాగంనాటి పరిస్థితి పూర్తిగావేరే. సమిష్టిశ్రమను కీర్తించే భాగాలు అందులో ఎన్నోఉన్నాయి. పనిపాట్లూ, కళలూ శిల్పాలూ ముఖ్యమని ఋగ్వేదార్యులభావం. త్వష్ట్రి అనేశిల్పిని దైవతుల్యుడుగా భావించడమే యిందుకు దాఖలా. పనికీ ఆలోచనకూ యెడబాటు వుండేది కాదప్పుడు. 'ధీ' అనేమాటకు పని అని అర్థం ఈమాటను 'ప్రజ్ఞ' (వివేకం)కు పర్యాయ పదంగా వాడే వాళ్లు అంటే, వివేకం కర్మనుంచి పుట్టిందని వారిభావం. కర్మఅంటే పని. అప్పట్లో 'మాయ' అనేమాట కూడా 'ప్రజ్ఞ'కు పర్యాయపదమే.

అలాంటిది, ఉపనిషత్తుల కాలానికల్లా పరిస్థితి బాగా మార్పు చెందింది. నిత్య జీవితానుభవాన్ని కిందుజేసే అధ్యాత్మతత్వాన్ని ప్రవేశ పెట్టింది, యుద్ధమే వృత్తిగాగల క్షత్రియులైతే, వారిని ఆశ్రయించుకున్న బ్రాహ్మణులు దాన్ని పెంపొందింపజేశారను కోవాలి. బ్రాహ్మణులనేకులు క్షత్రియుల వద్ద యీ జ్ఞానాన్ని పొందినట్టు ఉపనిషక్కథలు సూచిస్తున్నాయి. ఇదంతా తీరుబాటు కలిగిన వర్గం తలలో పుట్టిపెరిగిన అతిలోక తత్వమే. రాజుల అధికారం బ్రాహ్మణులకు యీ అవకాశం కలిగించింది. తాము కింది వర్ణాల వారిలా సంపదను వుత్పత్తి చేసేరకం కాదు, క్షత్రియుల్లా నేరుగా దోపిడిచేసే రకమూ కాదు. రాజులిచ్చే దానాలూ దక్షిణలూ పుచ్చుకు పొట్ట పోసుకోవాలి. ధర్మశాస్త్రాలు తమకు చూపిన జీవనోపాధి యిదే. భావవాద ధోరణి మన దేశంలో యీ ప్రత్యక్ష, పరోక్ష దోపిడీ వర్గాల-వర్ణాల భావజాలమే. తర్వాతి రోజుల్లో దీన్నే అద్వైతమనీ, అద్వైత వేదాంతమనీ అన్నారు. దీన్ని బాగా ప్రచారంచేసి ప్రసిద్ధికి తెచ్చిన వ్యక్తి శంకరుడు.

శంకరుడికీ ఉపనిషత్కర్తలకీ మధ్య చాలా వ్యవధివుంది. ఆ మధ్యకాలంలో మహాయాన బౌద్ధులు ఉపనిషన్మతమైన భావ వాదాన్ని ('విజ్ఞాన'వాదం) చేబట్టారు. అలా చెయ్యడంలో, గౌతమ బుద్ధుడికి, అతని బోధలకీ సున్న చుట్టారు. వీరిలోకెల్లా నాగార్జునుడు మేటి. గౌతమ బుద్ధుడు బోధించాడంటూ నాగార్జునుడు వర్ణించిన కొన్ని బోధల్ని, నిజానికి, గౌతమ బుద్ధుడు యెరగనే యెరగడు. దేశసంచార క్రమంలో నాగుల వద్ద తనకు లభించిందని నాగార్జునుడు చెప్పిన 'ప్రజ్ఞాపారమిత' గ్రంథం అంతా, ఆతగాడి కల్పనే. ఈ మాటను ఆ నాడే హీనయాన బౌద్ధులెందరో అని వున్నారు. గౌతమ బుద్ధుడు మరణించిన నూరేళ్లకే కొందరు అతన్ని 'లోకోత్తర బుద్ధుడు' అంటూ దైవ సన్నిభుణ్ణిచేశారు. వీరికి 'మహాసాంఘికులు' అని పేరు. దేవుడూ దయ్యం గొడవ బుద్ధుడికి లేనేలేదు. లోకులబాధ గురించే బుద్ధుడిబాధ. కాగా, యీ మహాసాంఘికులు బుద్ధుణ్ణి దేవుణ్ణిచేసి కల్పనా కథలెన్నో అల్లి 'మహావస్తు', 'లలిత విస్తర' వంటిగ్రంథాలు రచించసాగారు. వీరే మహాయాన పంథాకు మార్గదర్శకులనాలి. మహాయాన బౌద్ధులు పాళీ భాషలోగాక, సంకర సంస్కృతంలో, 'మహాయాన సూత్రాలు' రాశారు. వీటిలో ముఖ్యమైనది 'ప్రజ్ఞా పారమిత', 'సమాధిరాజ', 'లంకావతార', 'సద్ధర్మ పుండరీక', వగైరా. 'కరుణ', 'బోధి' అనే గొప్ప శక్తులు గల దేవుడుగా బుద్ధు డిప్పుడు భావింపబడ్డాడు. ఈ మహాయాన సూత్రాల్లో కనిపించె తత్వం, భౌతిక ప్రపంచానుభవాన్ని తృణీకరించేది. 'పారమార్థిక సత్యం' అనేది అనుభవ సత్యమైన 'సంవృతి సత్యం' కంటే మిన్న అన్నారు. ఈ ధోరణి ఉపనిషత్తులదే.

బృహదారణ్యక, చాందోగ్య ఉపనిషత్తులలో 'ఆత్మ' అనబడేదానికి పెద్దపీట వెయ్యడం జరిగింది. ఆత్మజ్ఞాని ఒక్కడేజ్ఞాని అనిపించుకున్నాడు. ఆత్మఅనంతం, అవ్యయం, అనిపించుకుంది. బయటి ప్రపంచంనుంచి లోపలి ప్రపంచానికి మారింది ధ్యాస. ఆత్మఒక్కటే సత్యం. అన్యం అసత్యం. అది 'విజ్ఞానఘనం'అని యాజ్ఞవల్కుడు వర్ణించాడు. చైతన్యరాశి పరమసత్యం అయికూచుంది. వేదాలన్నీ దీనిముందు వట్టి పేర్లే అనిపించుకున్నాయి. వేదవిద్యలు- వ్యాకరణం, గణితం, రాజనీతి, జ్యోతిషం, లలితకళలు- పనికిరాలేదు. వేదవేదాంగాలనూ ఇతిహాసాలనూ విద్యలనూ కళలనూ తెలుసుకున్నానన్న నారదుడు, వీటినిమించిన పరమజ్ఞానాన్ని సనత్కుమారుడివద్ద తెలుసుకోగోరాడు. ఇంద్రియజ్ఞానం, దాన్నిసాధించే వివిధ ప్రమాణాలు, వగైరా, లెక్కకు రాకుండాపోయాయి. ఇదంతా 'అవిద్య'- అంటే. బ్రహ్మజ్ఞానం లేకపోవడమన్న మాట. ప్రయోగజ్ఞానం బ్రహ్మజ్ఞానాన్ని కలిగించదట. పైగా, దానికి అడ్డంకికూడానట

బహుత్వంఉన్న యీ ప్రపంచంకాకుండా, ఏకత్వంఉన్న భావప్రపంచం మొదలైంది. ఈప్రపంచం అందుచేత వట్టిమాయ.

ఇలా ప్రారంభమైన భావవాదాన్ని మహాయాన బౌద్ధులూ, శంకరుడూ పెంచి పోషించారు– అనుభవం హేతుబుద్ధి అనేవాటిని నిరాకరించారు– నాగార్జునుడు 'ప్రమాణ విధ్వంసనవాదం' చేశాడు– లోకవాస్తవాన్ని నిరాకరించడానికి అది తప్పనిసరి అయింది– మిగిలింది 'శూన్యత'– అదేనట పరమసత్యం– అది వర్ణించడానికి వీలులేనిది– నిజం అనుకునేవన్నీ వట్టి మనోవికారాలేనని నాగార్జునుడంటాడు– కాబట్టి యీశూన్యవాదం విజ్ఞానశాస్త్రానికి విరోధి– వ్యావహారిక సత్యమే లేకుంటే విజ్ఞానశాస్త్రం ఎలావుంటుంది? కుమారిలుడు యీవాదాన్ని ఎదుర్కొన్నాడు– వ్యావహారికసత్యం సత్యమే కాదనడం దగాఅన్నాడు– సత్యం రెండువిధాలనడం సరికాదన్నాడు– అద్వైత వేదాంతులు ఈ వాదాన్ని మహయాన బౌద్ధుల వద్దనుంచి అరువు తెచ్చుకున్నారు అయితే బౌద్ధులంటే అక్కసుకొద్ది ఆమాట ఒప్పుకోలేదు శంకరుడు నాగార్జునుడి 'మాధ్యమిక' వాదాన్ని తిరస్కరిస్తూ, కనిపించే ఈప్రపంచాన్నీ యీజీవితాన్నీ తోసివెయ్యడం తగదన్నాడు– అలాఅంటూనే, ఎదో ఒక కొత్తసత్యాన్ని కనుగొంటెమాత్రం తోసివెయ్యవచ్చునని తన వాదాన్ని సమర్థించుకున్నాడు– నిజానికి, నాగార్జునుడిలాగే శంకరుడుకూడా ఈప్రపంచాన్ని నిరాకరించాడు– ఇహలోకానుభవం అంతా అవిద్యమయమేనని అతని నమ్మకం– ఇదివట్టి 'మాయ'– వేదాలుకూడా అవిద్యమీద ఆధారపడ్డవే– జ్ఞానేంద్రియాలవల్ల సమకూరేది ఏమాత్రం నిజంకావడానికి వీల్లేదు– వేదాల్లోనూ ద్వైతంవుంది– అద్వైతి దృష్టిలో అది అవిద్య ఫలితమే– కానైతే, వేదాలమూలాన తాత్వికజ్ఞానం పొందవచ్చు– అలాపొందాక, వేదాలను తిరస్కరించినా తప్పులేదు– ఏరుదాటేవరకే తెప్పతోపని– ఆపైన, పనిలేదు–

శంకరుడి వాదం కొత్తదేమీకాదు. వేదాలను కాదనడం కంటె, అనుభవాన్నీ హేతుబుద్ధినీ కాదనడమే, అద్వైతవేదాంతానికి ముఖ్యం. ఇది ఉపనిషత్తులలోనే మొదలైంది. ఆత్మఅంటే "నీతి" (ఇదికాదు) 'నీతి' అనడమేగాని, ఇది, అది అని యాజ్ఞవల్క్యుడుకూడా చెప్పలేదు– అనుభవాన్నీ హేతుబుద్ధినీ నిరాకరించబట్టె యిలా చెప్పవలసివచ్చింది– 'సత్' లేదా 'బ్రహ్మ'ను గురించి మరి తెలుసుకోవడమెట్లా? తెలుసుకునే వాడొకడు, తెలుసుకోబడే దొకటి– యిలా రెండు వుంటే పొసగదు ఆత్మ తన గురించితానే తెలుసుకోవాలి– అంటే, అదీ యిదీ వొకటే నిద్రావస్థలో మనిషి ప్రపంచంనుంచి విడిబడి, తన స్వయంప్రకాశం వెలుగులో ఎన్నెన్నిటినో

చూస్తాడు- మేలుకునివున్న స్థితినుంచి స్వతంత్రిస్తాడు- కలలో చూసే వస్తువులకు భౌతికమైన జీవితం వుండదు- ఉండేదల్లా మనస్సంబంధమైన వునికే మనస్సు సృష్టించేవే ఇవన్నీ- జీవులుకూడా తమకు తెలీకుండానే రోజురోజూ బ్రహ్మలోకానికి పోయి వస్తూవుంటారు గాని దాన్ని గుర్తించలేరు. ఇది యాజ్ఞవల్క్యుడి ఉపమానం. శంకరుడు దీన్ని పట్టుకున్నాడు- బౌద్ధుల్లో 'యోగాచారులు' అనబడేవాళ్ళు మెలకువలో కూడా యీ నిద్రావస్థను సాధిద్దామని, యోగాన్ని ఆశ్రయించారు- కలలోని అద్వైతం పరమ తాత్కాలికం- దీన్ని శాశ్వతానుభూతిగా మార్చుకోవాలంటే, యోగమే శరణ్యం లేదా, మరణమైనాసరే. మళ్ళీమళ్ళీ జన్మలేని మరణం, బ్రహ్మైక్యం, మేలని యాజ్ఞవల్క్యుడన్నాడు- అహం బ్రహ్మాస్మి అనుకున్న వాడికిక కోరికలులేవు, రుచులు, వాసనలు, మాటలు, ఏవీవుండవు- వాడిక జన్మించడుమళ్ళీ. తత్వజ్ఞానానికి పారమ్యం ఇదేఅయింది. అంతదూరం వెళ్ళగోరనివాళ్ళు, యిలాంటి మరణాన్నిగాక 'తురీయావస్థ' అయిన యోగసమాధిని నమ్ముకున్నారు. చేతనావస్థనుంచి పూర్తిగా తప్పుకుని మనస్సు తనలోకితాను ఒదిగిపోయే స్థితిలో పరమాత్మను దర్శించవచ్చు ననుకున్నారు. ఎలాగైనా ప్రాపంచికమైన జ్ఞానాన్ని లేకుండా చేసుకోవాలి- అలాచేసుకోవడమే తాత్విక జ్ఞానానికి తొలిమెట్టు. వివేకం కావలసింది అ-వివేకానికి, జ్ఞానంకావలసింది అ-జ్ఞానానికి దారి తీసిందనుకోవాలి.

భావ వాదానికి విత్తనం వేసిన ఉపనిషత్తులు వేదాల్లాగే ఒకరో ఇద్దరోగాక ఎందరో చెప్పినవి- వివిధ సమయాల్లో చెప్పినవి- లౌకికమైన వేదమతం నుంచి ఉపనిషత్తులు బ్రహ్మతత్వానికి ప్రయాణం కట్టాయి- యాజ్ఞ వల్క్యుడి లాంటి వాళ్లకు భూరి దక్షిణలు ముట్టాయి- వాస్తవ సత్యాన్ని సిద్ధాంత పరంగా నిరాకరించే వాళ్ల వాస్తవమైన ఆస్తిపాస్తులకు మాత్రం దూరం కాలేదు- మహాయాన బౌద్ధులు సైతం ఆరామాల్లో విరామ జీవితం గడుపుతూ వచ్చారు- ఇక, శంకర మఠాల సంగతి చెప్పే పనేలేదు- భారతీయ తత్వశాస్త్ర చరిత్రలో భావవాద ధోరణి, పరకష్టోపజీవులైన ఉన్నత వర్ణాల వారి సృష్టి- అవే పాలక వర్గాలూ అయినందుచేత, వాటి అధికారానికీ ఆస్తికీ యిది తాత్విక కవచం.

## భౌతికవాదం

భారతీయ తత్వమంటేనే ఆధ్యాత్మికత్వం అనే దురభిప్రాయం ఒకటి బలంగా వుంది- దాని వ్యతిరేకులంతా చేరి పిడికెడు మంది అయినా లేరనే భావమూ వుంది. లోకాయతికులు, బార్హస్పత్యులు, చార్వాకులు, యిలా యేవో కొన్ని పేర్లు మాత్రమే

మిగిలాయి తప్ప వాళ్ల రచనలు అసలు మిగలలేదనికూడా లోకం అనుకుంటుంది. వీళ్లకెవరికీ గౌరవ మర్యాదలు లేవు సరిగదా, వీళ్ళు అసుర సమానులే ననిపించుకుంటున్నారు. తెలివితేటల్లో పశువులకంటె తక్కువేనని వాచస్పతి మిశ్రుని లాంటి వాళ్లు యెద్దేవాచేసి వున్నారు.

లోకాయతికులు మాత్రమే భారతీయ భౌతిక వాదానికి ప్రతినిధులనుకోవడం సరికాదు. ఉపనిషత్తుల కాలానికే, అంటే, లోకాయతం వెలువడక ముందే, ఉద్దాలక అరుణి భౌతికవాదాన్ని ప్రపంచించి వున్నాడు. ఛాందోగ్య ఉపనిషత్తులో అతనికీ, అతని కుమారుడైన శ్వేతకేతువుకీ మధ్య సాగిన సంభాషణ దీన్నే సూచిస్తుంది. ఉద్దాలకుడు చెప్తాన్న 'సత్' వేదాంతులు వర్ణించిన 'బ్రహ్మ' కాదు. ఆ సత్ 'ప్రకృతి' మాత్రమే. భావవాదానికి తొలి మేటి ప్రతినిధి అయిన యాజ్ఞవల్క్యుడి అభిప్రాయాలకు ఉద్దాలకుడి అభిప్రాయాలు యెదురు.

ఆ కాలానికి గంగానదీ పరీవాహ ప్రదేశంలో వెనకటి జానపదాలు అంతరించి రాజ్యాలు తలెత్తసాగాయి. వర్గ పోరాటం మొదలౌతూ వచ్చింది. దీని ఫలితమే భావ సంఘర్షణ. వైదిక మంత్ర కాండను సమర్థించే వారికి విజ్ఞాన శాస్త్రదృక్పథాన్ని సమర్థించేవారు యెదురు నిలిచారు. ఆయుర్వేదం మతాన్ని ఢీకొంది. వైద్యులు బ్రాహ్మణులను నిలదీశారు. జ్యోతిశ్శాస్త్రం, భూగోళ శాస్త్రం, దండనీతి, ధర్మ శాస్త్రం మొదలయ్యాయి. చర్చ ప్రారంభమైంది. సంశయం తలెత్తింది. ఉద్దాలకుడి ఆలోచనా ధోరణిలో కనిపించేది యీ కొత్త వైజ్ఞానిక దృక్పథమే ననుకోవాలి. అనుమాన, దృష్టాంత, ప్రమాణాలతో, సాదృశ్యాలతో, హేతుబుద్ధి పూర్వకమైన వాద బలంతో తదనంతర కాలాన తార్కికులు యింకా అభివృద్ధి పరచిన పద్ధతికి ఉద్దాలకుడు మార్గదర్శి.

తినేతిండివల్ల మనస్సు పుష్టి పొందుతుందని కుమారుడికి నచ్చచెప్పేందుకు ప్రయత్నిస్తూ, మనస్సనేది ఆహారమయమని, ప్రాణం జలమయమని, వాక్కు ఉష్ణమయమని ఉద్దాలకుడు నిరూపించాడు. మనశ్చైతన్యం వృద్ధిపొందాలంటే మనిషి బాగా తినాలంటాడు. తదనంతర కాలంలో భౌతికవాద తాత్వికులు రూపొందించిన 'భూత చైతన్య వాదాని'కి (దీన్నే 'దేహాత్మవాదం' అని అంటారు) ఇది మూలమేమో! దేహం భౌతిక వస్తువుల పరిణామం వల్లనే ఏర్పడుతుంది. మనశ్చైతన్యం దీనిఫలితమే. అంటే ఇది దేహలక్షణమేతప్ప దేహానికి సంబంధం లేనిదేమీకాదు. అశరీరమైన ఆత్మ అసంభవం. చైతన్య రహితమైన పదార్థం ఎలా చైతన్యంగా పరిణమిస్తుందో నిరూపించేందుకు తగిన వైజ్ఞానిక సామగ్రి ఆరోజుల్లో భౌతికవాదులకులేదు. సాదృశ్యం

మూలంగానే వాళ్ళు ఈసిద్ధాంతం చెయ్యగలిగారు. మధువుకు మత్తుకలిగించేగుణం, ఆ మధువును తయారు చేయడానికి సమకూర్చిన వస్తువుల్లోలేదు. అలాగే దేహనిర్మాణానికి సమకూడిన పదార్థాలకు లేనిచైతన్యం దేహానికివుంది. 'విశేష పరిణామం' అంటే ఇదే.

ఉద్దాలకుడు ప్రతిపాదించిన భౌతికవాదం అక్కడితో ఆగిపోలేదు. కౌటిల్యుడు తన 'అర్థశాస్త్రం'లో రాజకుమారుల విద్యగురించి రాస్తూ నాలుగు విద్యలను పేర్కొన్నాడు. 'ఆన్వీక్షకి' అనేది మొదటిది. దాన్నే తర్కవిద్యఅనీ, హేతువిద్యఅని అంటారు. రెండవది 'త్రయీ, ఋక్, యజుస్, సామవేదాలను 'త్రయీ' అనేవాళ్ళు వేదాలంటే, ఉపనిషత్తులూ వున్నాయి. అవి "వేద+అంతం" (వేదాంతం) అయె మరి: చిత్రమేమంటే, కౌటిల్యుడు తర్కవిద్యనూ వేద, వేదాంతాలనూ వేరుచేసి చూశాడు. మనువులాంటి ధర్మశాస్త్రకారుల దృష్టివేరే. 'ఆన్వీక్షకి' వేదాలకు స్వంతంత్రింగా, స్వచ్ఛందంగా ఉండడం వాళ్ళకు ససేమిరా యిష్టంలేదు తర్కంవేదానికి అధీనమై వుండాలంటారు- లేకుంటే, అది తప్పుతోవలు తొక్కించగలదని భయం- కాబట్టి వాళ్ళు యీ నాలుగు విద్యలలో 'ఆన్వీక్షకి'ని చేర్చరు- కౌటిల్యుడు ఆన్వీక్షకిని అగ్గించి చెప్పాడు. విద్యల కన్నిటికీ ఇది దీపంలాంటి దన్నాడు. కొత్త పాలకవర్గాల ప్రతినిధి అయివుండి కూడా, యిలాయెందుకు చేశాడంటే, యీవిద్యలన్నీ రాజకుమారుల కోసమే గాని ప్రజాసామాన్యంకోసం మాత్రం కాదు కాబట్టి, ప్రజలను మూఢనమ్మకాల వాతదోసి రాజ్యాన్ని సుస్థిరం చేసుకునేందుకు ఆన్వీక్షకిలాంటి విద్యలు రాజులకు ఎంతో అక్కరకు వస్తాయని కౌటిల్యుడి వుద్దేశం. 'దండం' (రాజదండం)ను ఆదుకోటానికే యివన్నీ. అయితే. కౌటిల్యుడి మాటలవల్ల మనకు తెలిసే విశేషం ఒకటుంది. హేతువాదానికీ భౌతికవాదానికీ మధ్య మొదటినుంచీ వుంటూవచ్చిన దోస్తీ ఎలాంటిదో మనకు తెలుస్తుంది. 'ఆన్వీక్షకి' కింద కౌటిల్యుడు పేర్కొన్న తత్వాలు సాంఖ్యం, యోగం, లోకాయతం. న్యాయాన్నీ, వైశేషికాన్నీ ఎందుకు పేర్కొ లేదు?

కౌటిల్యుడు పేర్కొన్న 'యోగం' పతంజలి యోగ దర్శనంకాదు. దీనికి తత్వవిశేషంగా స్వతంత్రస్థితి లేదు- అనాది నుంచి పరంపరగా వస్తున్న కొన్ని మనశ్శరీర నియమాలనూ పద్ధతులనూ వర్ణించి చర్చిస్తుంది. ఈ నియమాలమూలంగా పద్ధతుల ద్వారా అతిలోక శక్తులు సాధించవచ్చు నంటుంది. దేవుడి గురించి తనకున్న పిచ్చను ఈ యోగ దర్శనంలో దూర్చాడు పతంజలి- దీన్ని తీసివేస్తే మిగిలే దంతా సాంఖ్యమే- అందుచేత పతంజలి యోగాన్ని 'సేశ్వర (స+ఈశ్వర) సాంఖ్యం' అన్నారు. అంటే, భగవదాస్తిక్యపరమైన సాంఖ్యమని అర్థం. అసలు సాంఖ్య-యోగంలో యీఈశ్వరుడికి

జాగాయేలేదు. దీన్ని తెచ్చి చూర్చినందువల్ల, సాంఖ్య-యోగాన్ని పతంజలి గందరగోళం చేశాడనాలి. అనాదినుంచి పరంపరగా వస్తున్న యోగాచారాల గురించి ఛోగట్టా సేకరించి పెట్టాడే గాని, తానుగా యోగ దర్శనానికి పతంజలి కర్త కాలేదు. కౌటిల్యుడు పేర్కొన్న 'యోగం' న్యాయ-వైశేషికమే గాని పతంజలి యోగం కాదు. నిజానికి, న్యాయ వైశేషికానికే 'యోగ' అనే పాత పేరొకటి వుండేది. ఇది యెలాగంటే, 'యోగ' శబ్దానికి 'సంయోగం' అనే అర్థం కూడా వుంది. అణువుల కూడిక వల్ల చరాచర ప్రకృతి అంతా రూపొందిందని న్యాయ-వైశేషికుల సిద్ధాంతం. అందుచేత కౌటిల్యుడు న్యాయ-వైశేషికాలను పేర్కొకుండానే వాటి పాతపేరైన 'యోగ' శబ్దాన్ని వాడాడు. న్యాయ దర్శనంలో వైశేషికం వుండనే వుంది. తర్కంలో 'యుక్తి' (దీన్నే యోగం అనికూడా అంటారు) ని విశేషంగా వాడడం న్యాయ దర్శనానికి గుణం. 'అన్వీక్షకి' విద్య కింద కౌటిల్యుడు చేర్చిన యోగం, న్యాయవైశేషికం. దీనికి తోడు, లోకాయతం, సాంఖ్యం వున్నాయి. ఇవన్నీ భౌతికవాద దృక్పథానికి చెందినవే. అంటే, కౌటిల్యుడి కాలానికి భారతీయ తాత్విక సంప్రదాయం అంతా భౌతిక వాదానికో భౌతిక వాదానికి సమీపంగా వున్నదానికో చెందిందని ఇప్పుడు నిర్ధారణగా చెప్పవచ్చు. తదనంతరకాలాన, సాంఖ్య దర్శనంలోకి వేదాంత భావాలు వెల్లువగట్టి ప్రవేశించాయి. అలాగే న్యాయ-వైశేషిక దర్శనాలలోకి ఆస్తిక్య భావాలు. మొదట్లో మాత్రం అవి శుద్ధ భౌతికవాద దర్శనాలే- ఇలా రూపు చెడిన తర్వాత కూడా, సాంఖ్యం ఈశ్వరుణ్ణి నిరాకరిస్తూనే పోయింది గాని తల దాల్చలేదు- కాకుంటే, యీ ప్రపంచానికి మూల కారణమని సాంఖ్యవాదులు పేర్కొన్న అచేతన ప్రధానమైన 'ప్రకృతి' మీద ఒక 'పురుషుణ్ణి' తెచ్చి మోపడం జరిగింది. అయినా యీ 'పురుషుడు' (దేవుడు) తమ చట్రంలో యిమడలేదు. ఇతగానికి ఆటే అవకాశమూ లేదు. ప్రపంచ నిర్మాణం (సృష్టికాదు) లో పాల్గొన్న అణువులు తుదీ మొదలూ లేనివి. వాటిని ఎవడూ పుట్టించలేదు. కాబట్టి 'పురుషుడు' ప్రపంచానికి కర్తకాదు. మనిషి పనులవల్ల కలిగే ఫలాఫలాలను నిర్ణయించేదీ వాడుకాదు, అవే. కాకుంటే, పేరుకి మాత్రమే వీడు దేవుడు. రెండు అణువుల తొలికలయికను కలిగించాడేమో ! కాబట్టి 'నిమిత్త కారణం' అనిపించుకున్నాడు. 'న్యాయ' దర్శనకర్త అయిన గౌతముడు మాత్రం మనిషి కర్మఫలాలను నిర్ణయించేది కర్మలేనని తెగేసి చెప్పడం జరిగింది. అంతా వస్తుస్వభావాన్ని బట్టే జరుగుతుందని గౌతముడన్నాడు గనుక, యీ సిద్ధాంతాన్ని 'స్వభావవాదం' అన్నారు. ముల్లు కరుగ్గా వుందంటే అది దాని స్వభావమే. తాకితే తెలుస్తుంది. ఎవడో కల్పించింది కాదు. కాబట్టి యీ ప్రపంచానికి 'నిమిత్తకారణం'

# రోజెన్‌బర్గ్ దంపతులు

"జీవితం కోసం జీవితాన్ని బలిగా పెట్టవలసిన అవసరం లేనంతగా యింకా మన నాగరికత అభివృద్ధి చెందలేదన్న లోతైన అవగాహనతోనే మేం మా ప్రాణాలను ఒడ్డుతున్నాం. మా తర్వాత యితరులు యీ ఆశయాన్ని ముందుకు తీసుకుపోతారన్న సంతృప్తి మాకున్నది-" అంటూ ఎథెల్, జూలీ అనే అమ్మా నాన్నలు 25 సంవత్సరాల కింద ఉరికంబం (కరెంటు కుర్చీ) ఎక్కబోతూ ఆరేళ్ళ, పదేళ్ళ వయసున్న తమ ఇద్దరు పిల్లలకు రాసిన మాటలు- యిప్పటి మన నాగరికత ఎంత ఎదిగిందని ఇంకా ప్రశ్నిస్తున్నాయి.

రోజెన్‌బర్గ్ దంపతులుగా ప్రపంచాని కంతటికీ తెలిసిన ఎథెల్, జూలియస్ రోజెన్‌బర్గ్‌లు కష్టజీవుల కుటుంబాల నుంచి వచ్చినవారు. ఎథెల్ కుట్టుమిషనులు బాగుచేసే ఆయన కుమార్తె- జూలియస్ మిఠాయి కొట్లో నౌకరు కొడుకు. అప్పట్లో చిన్న చిన్న పనులు చేసుకుంటూ ఉండిన వాళ్ళు ఈ దంపతులు.

ఎప్పుడు వాళ్ళు (తాము చేయని) నేరాన్ని చేసినట్టు ఒప్పుకుంటారో అప్పుడే ఉరిశిక్ష రద్దవుతుందని ప్రభుత్వం జైళ్ళ అధికారికి చెప్పివుంచింది. "ఈ మరణశిక్షకు

---

ఒకటి లేదంటాడు గౌతముడు. అప్పట్లో విజ్ఞానం అంతంతగానే వుండేది కాబట్టి ప్రాణుల పుట్టుక గురించి గౌతముడు నిర్దుష్టంగా చెప్పలేక పోయాడు. తల్లి కడుపులో పిండం పెరగడానికి అణువులేగాక, 'అదృష్టం' కూడా వుంటుందని అన్నాడు. 'అదృష్టం' అంటే కంటికి కనిపించనిది. ఇదైనా ఒక భౌతిక శక్తే. సూదిని సూదంటు రాయి వైపుకి లాగేది యీ అదృష్టమే. స్వభావవాదం భారతీయ భౌతిక వాదానికి ఒక ముఖ్యమైన లక్షణం. గౌతముడూ (న్యాయదర్శన కర్త), కణాదుడూ (వైశేషిక దర్శనకర్త), వేదాల ప్రామాణికతను అంగీకరించారు. ఇది తమ తాత్విక వైఖరినే ఖండించేది కాదా? కావచ్చు గాని, వాళ్ళొక వుద్దేశంతో ఆ పని చేశారు. వేద ప్రామాణికతను తలదాల్చే వాళ్ళ బారిని పడిపోకుండా తప్పించుకునేందుకు, మాట మాత్రంగా గ్రంథా ప్రారంభంలో వేదాలను అగ్గించి, ఆ తర్వాత దానికి పూర్తిగా భిన్నంగా గ్రంథాన్ని నడుపుకుపోయారు. ఉపక్రమానికీ ఉపసంహారానికీ పొంతనే లేదంటే, ఇదే కారణం.

కాబట్టి లోకాయతమో చార్వాకమో మాత్రమే భారతీయ భౌతికవాదానికి ఏకైక ప్రతినిధి అనడం, అనుకోవడం, చాలా పెద్ద పొరపాటు.

– దేవీప్రసాద్ చటోపాధ్యాయ

అనువాదం: రమ

అతీతమైంది మా ఆశయం. మమ్మల్ని పావులుగా ఉపయోగించుకోవడానికి మేం అంగీకరించలేం. మా గౌరవాన్ని మేం అమ్ముకోలే"దని నెమ్మది నెమ్మదిగా చివరి గడియలకు చేరుకున్న వేళ కూడా (సమాధానం) చెప్పారు వాళ్ళు.

తమ పిల్లలను చూసైనా శిక్ష తప్పించుకోను వాళ్ళు నేరం ఒప్పుకోవాలని జడ్జి అన్నప్పుడు– "స్వార్థపరులకు తామూ తమ పిల్లలూ బాగుండడమే చాలు. మా ఆలోచన అది కాదు– మా పిల్లలతోపాటు అందరి పిల్లలూ ఆనందోత్సాహాలతో అల్లారు ముద్దుగా పెరగాలి– అటువంటి సమాజం కావాలని కోరుతున్నాం– ఇదే ఈ వ్యవస్థలో నేరమైపోయింది"– అన్నారు రోజెన్‌బర్గ్ దంపతులు.

రోజెన్‌బర్గ్‌లను ఖూనీ చేయవద్దని ప్రపంచమంతటా ఉద్యమం సాగింది. అమెరికా అంతటా 15 నిమిషాల పాటు పరిశ్రమలు, రవాణా, కార్యాలయాలూ అన్నీ బంద్ జరిపాయి. చట్టబద్ధంగా జరుగుతున్న ఈ ఉరిని నిలుపుచేయాలని తత్త్వవేత్త జీన్‌పాల్ సార్త్రె కోరాడు. పోప్, యింకా ఎందరో యీ మరణశిక్షలు రద్దు చేయమని అమెరికా అధ్యక్షునికి విజ్ఞప్తి చేసారు. వాళ్ళను విడుదలచేస్తే వాళ్ళకు తమ దేశంలో పౌరసత్వం యిస్తానని పోలెండు దేశం అమెరికాకు తెలిపింది.

అయినా– వాళ్ళను ఉరితీసారు.

1929–33 మధ్య కాలంలో ఒక్క సోవియట్ యూనియన్‌లో తప్ప మిగతా ప్రపంచమంతటా పెద్ద సంక్షోభం వచ్చినపుడు– అమెరికాలో, దుకాణాల నౌకర్ల సంఘానికి అధ్యక్షుడుగా వుండి సమ్మెకు నాయకత్వంవహించి ఉద్యోగం పోగొట్టుకున్న వాడు జూలియస్ తండ్రి. ఇబ్బందులపాలైన ఈ కుటుంబం నుంచి వచ్చిన జూలియస్‌పై ప్రపంచ పరిణామాల ప్రభావం పడుతుంటే– చుట్టూ అనేక ఘోరాలు జరుగుతుండడం చూస్తుండగా– దేవుణ్ణి ప్రార్థిస్తూ కూచుంటే లాభంలేదు, మనిషి చేస్తున్న కిరాతకాలను మనిషే ఎదుర్కోవాలన్న భావం కలుగుతుంది. అతని చూపు మత సాహిత్యం నుంచి విప్లవ సాహిత్యం వైపు మళ్ళింది. 16 సంవత్సరాలుగా జెయిల్లో పడివుంటున్న కార్మిక నాయకుడు మూనీని ఆయనకు సంబంధంలేని హత్యకేసులో యిరికించి శిక్షించడ మేమిటి? ఎంత అన్యాయం? ఎంత దారుణం? అని ఆలోచించే స్థాయికి ఎదిగాడు జూలియస్. మూనీని విడుదల చేయాలనే ఉద్యమంలో పనిచేసాడు. కాలేజ్‌లో తీవ్రవాదుల గ్రూపుకు నాయకుడయ్యాడు. విద్యార్థి సంఘానికి ఉపాధ్యక్షుడయ్యాడు. ఒక వేశ్యను చెరిచారని అమాయకులైన స్కాట్‌బరో నీగ్రో యువకులు తొమ్మిది మందిమీద ప్రభుత్వం కేసు పెట్టినపుడు, వాళ్ళను విడుదల చేయాలని జరిగిన

ఆందోళనలో ముందున్నాడు జూలియస్. రాను రాను ఎక్కడ సమ్మె జరిగినా తానే వాలంటీరుగా ప్రత్యక్షమయే దశకు చేరుకున్నాడు. పెట్టుబడిదారులైన రాక్‌ఫెల్లర్లు, ఫోర్డులు దేశాన్ని ఎలా దోచుకుంటున్నారో ఉపన్యాసాలిస్తూ తిరిగాడు.

ఎథెల్, స్కూల్ తర్వాత స్టెనోగ్రాఫర్ ట్రెయినింగ్ పొంది వుద్యోగానికి కుదిరింది. ఇంకేదైనా మంచి వుద్యోగం దొరికితే బాగుండునని ఎదురు చూస్తూ ఒక సారి ఒక వుద్యోగం కోసం పోయింది. అక్కడ తనకంటె ముందే దరఖాస్తులు పెట్టుకున్న వాళ్ళు వెయ్యి మంది ఎంతో సేపటి నుంచి వేచి వుండడం చూసింది. ఆ దరఖాస్తుదారులు విసుగు పుట్టి తలుపులు బద్దలు కొట్టడం, ఫైర్‌యింజన్ వచ్చి వాళ్ళ మీద నీళ్ళు కుమ్మరించడం, తడిసి ముద్దయి కిందపడ్డ ఎథెల్‌కు నిరుద్యోగం, మరియు ఆ వ్యవస్థ గురించిన పాఠాలు నేర్పాయి. ముందు వున్న వుద్యోగంలోనే వుంటూ, ఆడ పనివాళ్ళు చేసిన పెద్ద సమ్మెకు నాయకత్వం వహించినప్పుడు సమ్మె జయప్రదమైంది. కాని ఆమె వుద్యోగం పోయింది. ఇది అన్యాయమని అయిదు నెలల తర్వాత లేబర్‌కోర్టు తీర్పు చెప్పింది. ఈ లోగా ఆమె వేరే కంపెనీలో వుద్యోగానికి కుదరవలసి వచ్చింది.

అంతర్జాతీయ సముద్ర కార్మికుల సంఘం వాళ్ళ సభల్లో పాటలు పాడుతున్నప్పుడు పరిచయమయ్యాడు జూలియస్. అపుడు జూలియస్ యింజనీరింగ్ చదవితే దబ్బెట్లా-అన్న ఆలోచనలో వున్నాడు. ఎథెల్ సాయంతో చదివాడు. తర్వాత యిద్దరూ నిరాడంబరంగా పెళ్ళి చేసుకున్నారు. సైనిక సప్లయి ఆఫీసులో జూలియసు యింజనీరుగా చేరాడు. అనుకూల దాంపత్యం వాళ్ళది. రాజకీయ సిద్ధాంత సమైక్యత కలిగిన జంట, జంటగా పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనేవారు. కార్మిక పత్రికకు చందాలు కట్టించడం, సాహిత్యం అమ్మడం వారి విధులుగా వుండేవి.

ప్రభుత్వం జూలియస్‌ని కమ్యూనిస్టు అన్న కారణాన వుద్యోగం నుంచి తీసేసింది. తర్వాత ఎవర్సన్ రేడియో కార్పొరేషన్‌లో పనిచేసాడు. కొంతకాలానికి అది మానుకొని ఎథెల్ పెద్దతమ్మునితో కలిసి విడిభాగాల వ్యాపారం చేసాడు. లాభం లేకపోగా ఎత్తేసారు. మళ్ళీ ఆమె చిన్నతమ్ముడు డేవిడ్ గ్రీన్ గ్లాసుతోకలిసి మరో వ్యాపారం పెట్టాడు.

ఇట్లా బతుకుతున్న వాళ్ళు చేసిన నేరంఏమిటి? దేశరక్షణకు అత్యంత అవసర మైన అణ్వాయుధ రహస్యాలను రష్యాదేశానికి చేరవేసే పనికి రోజెన్‌బర్గ్ దంప తులు పూనుకున్నారని ఆరోపణ. డేవిడ్ సైనికశాఖలో మెషినిస్టుగా చేరాక రోజెన్ బర్గ్ దంపతులకు రష్యాకు సాయంచేయాలన్న కోరిక కలిగిందట. ప్రపంచ శాంతి కోసం పోట్లాడుతున్న రష్యా చేతుల్లోకూడా అణ్వాయుధంవుంటే చాలా వుపయోగమని

ఆదంపతులు అనుకొని డేవిడ్, అతనిభార్య రూథ్, సోబెల్, హారీగోల్డ్, అనేవాళ్ళతో కుమ్మక్కయి, అణుబాంబు నమూనాను దొంగిలించి రష్యాకు పంపారట. డేవిడ్, రూథ్‌లు తమ 'నేరం' ఒప్పుకొని అప్రూవర్లుగా మారారు. రష్యాకు గూఢచారిగా పనిచేసాడన్న ఆరోపణపై ముప్పయి సంవత్సరాల కారాగార శిక్షననుభవిస్తున్న నేరస్తుడు హారీగోల్డ్ మరోసాక్షి. ఇంకోసాక్షిసోబెల్, జూలియస్‌కు ఇంజనీరింగ్ కాలేజీ సహవాసి. ఇంకొందరు సాక్షుల్నితెచ్చి, ప్రభుత్వం రోజెన్‌బర్గ్ దంపతులను రష్యా గూఢచారులుగా ముద్రవేసి, న్యాయస్థానంలో ముద్దాయిలనుగా నిలబెట్టింది.

వాళ్ళు నిజంగా గూఢచారులేనా? కాకపోతే అసలు కథఏమిటి?

అసలు డేవిడ్ ఏదోతప్పుడు పనిచేసాడు. డబ్బుకు ఆశపడి యురేనియం అమ్ముకున్నట్టు రోజెన్‌బర్గ్‌లకు అనుమానం. అందువల్ల అదేదోకేసులో ఇరుక్కుంటానన్న భయంతో పిచ్చెక్కిన కుక్కలా ప్రవర్తించాడు. అతని భార్యకుకూడా ఈ విషయంతెలుసు. అందుకే ఆమెగాబరాపడి పరాకుగాఉంటూ ఒళ్లుకాల్చుకున్నది. రోజెన్‌బర్గ్‌లతో కలిసి పెట్టుకున్న వ్యాపారంలో నష్టంవచ్చింది. డేవిడ్ చాలాసార్లు తగాదా పడ్డాడు. తాను ప్రమాదంలో ఇరుక్కున్నాకకూడా జూలియస్‌ను అర్జెంటుగా రెండు వేల డాలర్లివ్వమనీ, లేదంటే నిన్నేంచేస్తానో చూడనీ, బెదిరించాడు. ఇదివరకే డేవిడ్‌కుఎంతో సాయంచేసిన జూలియస్ అప్పుల్లోవుండి ఇంకా ఎక్కడ తెచ్చిస్తాడు? తాము ఇరుక్కున్న ప్రమాదాన్ని రోజెన్‌బర్గ్ దంపతుల మెడకు చుట్టదలచారు డేవిడూ, ఆయనభార్యా. అమెరికా సామాజిక వ్యవస్థను మొత్తానికే మార్చాలని ఉద్యమం నడుపుతున్న రోజెన్‌బర్గ్ దంపతులను ఏదొంగకేసులో ఇరికిద్దామాఅని చూస్తున్న ప్రభుత్వం డేవిడ్ దంపతులకు "అండగా" నిలిచింది.

హారిగోల్డ్‌కు ఏమివాగ్దానం చేసారోఏమో తెలియదు. జూలియస్‌మీద సాక్షిగా తీసుకొచ్చారు. అతడెప్పుడూ జూలియస్‌ను కలవనూలేదు, చూడనూలేదు. 'జూలియస్ పంపగా వచ్చా'నని డేవిడ్‌తో చెప్పాసన్నదే అతనిసాక్ష్యం. అతని వెనుకఉన్న మరో ముఖ్యమైన వ్యక్తి క్లాస్‌ఫక్స్‌అనే అణుశాస్త్ర పరిశోధకుడు. ఇంకోమోతుబరిసాక్షి ఎలిజిబెత్ బెంట్లీ. ఈమె ఇటలీదేశంలో చదివి నియంత ముస్సోలినీ భక్తురాలై ఫాసిస్ట్ పార్టీలోఉండి అమెరికాకు తిరిగివచ్చినామె. ఇక్కడ కమ్యూనిస్టు పార్టీలోచేరి గూఢచారిగా పనిచేసింది. తర్వాత బయటికివచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికొక పుస్తకంరాసింది. కమ్యూనిస్టు వ్యతిరేక ఉపన్యాసకురాలుగా దేశమంతటా తిరిగి డబ్బు సంపాదన మొదలుపెట్టింది. ఏపార్టీలో విటుడు దొరికితే ఆపార్టీలో చేరుతూ చివరకు అమెరికా నేరపరిశోధక సంస్థలో చేరిన కులట ఆమె అని క్రాస్‌పరీక్షలో తేల్చారు.

ఏఅఘాయిత్యానికైనా ఈమె సిద్ధం. నష్టంపడేందుకు పిల్లలూలేరు, భర్తాలేడు, పోయే పరువూలేదు. ఈమె జూలియస్‌ను ఎన్నడూ చూడలేదు. ఫోటోగ్రాఫర్‌ను ఒక సాక్షిగా తెచ్చారు పోలీసులు. ఆయనవద్ద రోజెన్‌బర్గ్‌లు తీయించుకున్న ఫోటోలకు నెగెటివ్‌లులేవు. డబ్బుచెల్లించినట్లు బిల్లుపుస్తకాలైనా వున్నాయాఅంటే అవీలేవు. ఇట్లాంటి సాక్షులు! వీళ్ళ పుట్టుపూర్వోత్తరాలను రోజెన్‌బర్గ్‌ల న్యాయవాది బట్టబయలు చేసాడు.

కేసును రుజువు చేసేందుకు ఒక్క కాగితం ముక్కగానీ వస్తువుగానీ ఆధారం దొరకలేదు. (కోర్టులోకి ఒక ఖాళీ డబ్బాను మాత్రం తెచ్చారు) డేవిడ్ అప్పుడు తాను యిచ్చానని చెప్పే నమూనా ఆరేళ్లు అయిన తర్వాత ఇప్పుడు ఫలానా విధంగా వుంటుందని గీతలు గీసి యివ్వగలిగాడు; దానికి ఏ కొలతలూ లేవు. ఏ ప్రత్యక్ష ఆధారం లేకుండా, పుక్కిటి పురాణాలుగా నోటి మాటలతో పరోక్షంగా చెప్పే సాక్ష్యాధారంతో నేరాన్ని రుజువు చేయడం అర్థంలేని విషయం. పైగా ప్రభుత్వం పోగుచేసుకొని వచ్చిన ప్రధాన సాక్షులు, వాళ్ళవాళ్ళ మాటల్లోనే పరిశీలిస్తే, గూఢచారులుగా పని చేసినవాళ్లు, అబద్ధాలకోర్లు, దేశద్రోహులూను. తమను పోలీసు వాళ్లు కేసుల నుంచి తప్పిస్తారన్న ఆశతో ఏమి చెప్పడానికైనా సిద్ధపడ్డ వాళ్ళు. అమాయకుల గొంతు కోయడానికైనా తయారు. వాళ్ళ సాక్ష్యాలు నమ్ముకొని, రోజెన్‌బెర్గ్ దంపతులను నేరస్థుల్నిగా నిర్ణయించడం?

రోజెన్‌బెర్గ్‌లు స్వార్థం కోసం ఏజెంట్లుగా పనిచేసే వాళ్ళైతే వాళ్ళ జీవితవిధానంలో అది ప్రతిబింబించాలి. దాదాపు పేదరికంలో నిరాడంబరంగా జీవిస్తున్న దంపతులు వాళ్లు. అట్లా కాక, కమ్యూనిజంకోసం చేసారనుకుంటే అదీ తప్పే. రోజెన్‌బెర్గ్‌లు నేరస్థులవునా-కాదా- అన్నది సమస్య తప్ప- వాళ్లు కమ్యూనిస్టులవునా కాదా- అన్నది కాదు. విచారింప బడుతున్నది రోజెన్ బర్గులు, కమ్యూనిజం కాదు. కమ్యూనిస్టులు అభివృద్ధిలోకి వచ్చి, పెద్ద స్థాయికి రావడం అంటే తర్వాత రష్యాకు ఏజెంట్లుగా, గూఢచారులుగా పని చేయడమే నన్న వాదం శుద్ధతప్పు, అవివేకం. "కమ్యూనిస్టు వ్యతిరేక ఉన్మాదంలోకి మనం దిగకూడ"దని రోజెన్‌బర్గ్ తరఫున వాదించిన న్యాయవాదులు కోరారు.

కాని, అమెరికాలో అప్పుడు కమ్యూనిస్టు వ్యతిరేక ఉన్మాదం వున్నత స్థాయిలో వున్నది. అమెరికాలో కమ్యూనిజం నుంచి ప్రభుత్వానికి ఏ ప్రమాదమూ వెంటనే లేక పోయినా, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు నేరస్థుల వలె ప్రభుత్వ రిజిస్టర్‌లలో సంతకాలు పెట్టాలని చట్టం చేసింది ప్రభుత్వం. కమ్యూనిస్టు బూచి యిదిగో వస్తోంది- అని పారెస్టల్ అనే మిలిటరీ కమాండర్ ఒకడు నిద్రలో తుళ్ళిపడి తన నివాసమైన 13వ

అంతస్తు నుంచి కిందికి దూకి చచ్చాడు. పౌతావరణాన్ని ఈ దశకు రెచ్చగొట్టడానికి చేసిన ప్రయత్నాలలో రోజెన్‌బర్గులపై పెట్టిన కేసు ఒకటి. అందుకనే జడ్జికి గానీ, జూరీలకు గానీ, రోజెన్‌బర్గుల నిర్దోషిత్వం పట్టలేదు, న్యాయవాదుల వాదనలూ పట్ట లేదు. సందు దొరికితే చాలు కమ్యూనిజం వాసనగల వాళ్ళను ఎట్లా శిక్షిద్దామా అన్న దురదలో వున్నారు. అందులోనూ ఎవరో దేశద్రోహులు తమ రహస్యాలను చేరవేయ బట్టే రష్యా అణ్వాయుధాలు సేకరించుకొని ధీమాగా వున్నదనీ, (ముసలమ్మ కోడితోనే తెల్లవారిందన్నట్టు,) ఆ ధీమాతోనే కొరియా దేశం తమ కాళ్ళ కిందికి రాకుండా ఎదిరించి పోట్లాడు తున్నదనీ వాళ్లు భ్రమలు పడుతున్నారు. అటంబాంబుల రహస్యాన్ని యీ ద్రోహులు చేరవేసిన కారణాన్నే యీ నాడు మన సైనికులు వేలాది మంది కొరియాలో బలైపోతున్నారని జడ్జి అన్నాడు కూడా— ఒకసారి మధ్యలో. తర్వాత— అమెరికా అధ్య క్షుడు ఐసెన్‌హోవర్ కూడా యిదే అన్నాడు.

అన్ని కోర్టులూ తిరిగి, అన్ని రకాల అప్పీళ్ళూ, అభ్యర్థనలూ చేసుకున్నా ఉరి శిక్షలు తప్పదన్నారు. "ఇక మనకు ఏ ఆశా అక్కరలేదు. ప్రజలే మనకు మిగిలిన ఆశ. చట్టరీత్యా జరుగుతున్న ఈ ఖూనీని ఆపగలిగితే వాళ్ళే ఆపగల"రని జూలియస్ అన్నాడు.

ఉరిశిక్ష అమలుకానున్న వేళ, రాజధానిలో అటార్నీ జనరల్ ఫోన్‌వద్ద కని పెట్టుకు కూచున్నాడు. ఆఖరిక్షణాల్లోనైనా రోజెన్‌బర్గ్‌లు తమ మనసు మార్చుకుంటే తగునిర్ణయం చేయవలసి వస్తుందని. మొదట జూలియస్ హత్య చేయబడ్డాడు. తర్వాత ఎథెల్ దగ్గరికి మతబోధకుడువచ్చి "పిల్లలకోసం నువ్వైనా మనసు మార్చుకోరాదా?"అని అడిగితే, "నేను చెప్పేదేమీలేదు, శిక్షకు సిద్ధంగావున్నా"నని ఆమె గంభీరంగా నడిచి పోయి తానే కరెంటుకుర్చీపై కూచున్నది. రోజెన్‌బర్గుల తరఫున కేసును మూడేళ్లగా నడిపించిన నిస్వార్థపరుడైన న్యాయవాది మెనీబ్లాకునుకూడా ఆకేసు తర్వాత బలిగొన్నది.

రోజెన్‌బర్గుల కేసువివరాలు సేకరించి, అమెరికా రచయిత లూయీనైజర్ ఒక పుస్తకం రాసాడు. (ఆయన కమ్యూనిస్టు వ్యతిరేకి). ఈపుస్తకం ఆధారంగా సి.పి. యమ్.రావు తెలుగులో "రోజెన్‌బర్గ్‌లు" అనే ఒకచిన్న పుస్తకం రాశారు. (మార్క్సిస్టు ప్రచురణలు, విజయవాడ-2) ఈపుస్తకం ముందుమాటలో ఇలావున్నది:—

"రోజెన్‌బర్గుల ప్రాణత్యాగం అమెరికాలో తిరుగుబాటు తేలేక పోయింది. ప్రపంచ ప్రజానీకంయొక్క— ఆందోళన వాళ్ళ ప్రాణాలను కాపాడలేక పోయింది. అయినా ఆశయానికి అంకితమయ్యే ఆదర్శమార్గాన్ని ఆ ఘటన భావితరాల ముందుం చింది."

— జీ. డి.

ఇ. రామకృష్ణన్ సుప్రసిద్ధ తమిళ కవి- రచయిత. 'చెంతరకాయ్' (అరుణ తార) అనే కలంపేరుతో ఆయన అసంఖ్యాకమైన పుస్తకాలు ప్రచురించారు. ఆయనది కడ్కతారు. నక్సలైట్‌గా అనుమానింపబడిన డి. శీరలన్ అనే యువ మేధావితో పరిచయమున్నదనే నేరంపై ఎమర్జెన్సీ కాలంలో అతన్ని చిత్రహింసలకు గురిచేసారు తమిళనాడులో పోలీసులు.

"నా కళ్ళకు గుడ్డలు కట్టి నా గ్రామం నుంచి నన్ను ఒక అడవికి తీసుకవెళ్ళారు. అక్కడ పోలీసులు నాలుగు రోజులపాటు నన్ను చిత్రహింసలకు గురిచేసారు. ఇంకా ఎంతోమందిని నా వలెనే నా కళ్ళముందరే ఇలాంటి చిత్రహింసలకు గురిచేసారు, వాళ్ళ ఆర్తనాదాలు, మూలుగులు, హాహాకారాలు ఇంకా నామనస్సులో నిన్ననో మొన్ననో జరిగినట్లుగనే వున్నాయి.

నాకు నక్సలైట్లతో సంబంధమున్నదని ఆరోపించారు- ఎందరో నక్సలైట్ల, మార్క్సిస్టుల జాడలు అడిగారు. నాకెవ్వరూ తెలియదని చెప్పాను- అంతే నా పని పట్టారు-" ఇవి రామకృష్ణన్ నోట వచ్చిన మాటలు.

ఆయన తన చేతులూ, కాళ్ళు ముందుకు చాచిచూపుతూ "ఈమచ్చలు చూడండి వాళ్ళు (పోలీసులు) తిట్లతో ప్రారంభించారు. ఇనుప కడ్డీలతో బెదిరించారు. తలపై, మోకాళ్ళపై, మడమలపై, మోచేతులపై లాఠీలతో కొట్టారు.

వెంటనే నామీద 'నిపుణుల' పని మొదలయింది. నాగోళ్ళలో సూదులు గుచ్చారు. నాకాళ్ళుకట్టివేసి ఇద్దరు పోలీసులు ఒకరువిడిచి ఒకరు తమ ఇనుపనాడాల బూట్లతో తన్నడం ప్రారంభించారు. నేను క్రమంగా వాస్తవ ప్రపంచస్పృహ కోల్పోతున్నాను. వాళ్ళప్రశ్నలు మరింత అర్థరహితంగా కనిపించినయ్. ఈ సమయంలో నాఒంటిమీద బట్టలన్నీ తొలగించి నాతలపై మంచులాంటి చల్లనీరు ఎడతెగకుండా గుమ్మరించారు. వాళ్ళు గంటల తరబడి నాకడుపులో తన్నారు. తర్వాత, నీళ్ళలో బాగా నానబెట్టిన తోలు చెప్పులతో కొట్టారు.

ఇది కూడ నా నుంచి ఏ సమాధానమూ రాబట్టనపుడు నా గొంతుపై ఒక రివాల్వర్ వుంచి ట్రిగ్గర్ నొక్కుతామని బెదిరించారు. నేనింక హతాశుణ్ణయి అరిచాను- "నేను నక్సలైటునుకాను, మార్క్సిస్టునుకాను- నేనే రాజకీయపార్టీకి చెందినవాణ్ణికాను."

ఇది నాపై హింసను మరింత పెంచిందే తప్ప తోడ్పడలేదు.

నేను స్పృహ కోల్పోయి నప్పుడల్లా డాక్టర్ వచ్చి నన్ను స్పృహలోకి తెస్తాడు- ఆయన నా నోట్లోకి కొన్ని గోలీలు తోసి ఇంజక్షన్ ఇస్తాడు- ఇట్లా స్పృహ తెచ్చిన ప్రతిసారీ మరింత తీవ్రంగా హింసిస్తారు.

నావలెనే ఇట్లా హింసలకు గురియైన ఎంతో మందిని జెనరేటర్‌లవలె వెలిగిపో తున్న విద్యుద్దీపాల కింద ఆ అరణ్య రాజ్యం లాంటి అడవిలో నేను నా కళ్ళతో చూసాను.

నన్ను నాలుగు రోజుల భయంకర చిత్రహింసల తర్వాత 8 జులై 1975 న వదిలారు."

అయితే ఆయన కష్టాలు అక్కడ అంతమైనవా?

"లేదు, ఈ పోలీసు వ్యవస్థలో ఒక్కసారి నువ్వు వాళ్ళదృష్టిలో పడ్డావంటే ఇంక జీవితాంతం నీపని తీరినట్లే. ఇంక నీశేషజీవితమంతా నిన్ను వాళ్ళు బెదిరిస్తూనే వుంటారు. వేధిస్తూనే వుంటారు. నిజానికీ విషమచక్రాన్ని పౌరహక్కుల, మానవ హక్కుల సంఘాలు ప్రముఖంగా బయటపెట్టాలి.

"రెండేళ్ళు నన్నట్లా వేధించారు. ఫిబ్రవరి 24, 1977న నా ఇంటిపై ఒక డిఎస్పీ నాయకత్వంలో పోలీసులు దాడిచేసారు. మరి వాళ్ళకేంవచ్చిందో నాకుతెలియదు.

వాళ్ళు మా డబ్బు దోచుకున్నారు. వస్తువులు దోచుకున్నారు. పాత్రలన్నీ ధ్వంసం చేసారు. చివరకు మంచంపట్టిన రోగిష్టి మా తల్లిపైకూడ చేయివేయకుండ వదలలేదు.

తర్వాత నన్నుపట్టుకొని బట్టలన్నీ విప్పేసి అండర్‌వేర్ మాత్రం వుండ నిచ్చారు. తాళ్ళుకట్టి లాక్కవెళ్ళి గ్రామంచావట్లో లాఠీలతో వందలాది జనంముందు విపరీతంగా కొట్టారు. తర్వాత కడలూరు న్యూటవున్ పోలీస్‌స్టేషన్‌కు తీసుకవెళ్ళి అక్కడఎన్నోగంటలు 'చిత్రహింసల చేంబర్'లో పెట్టారు. అంతసేపూ నేను తమతో సహకరించకపోతే శీరలన్‌కుపట్టినగతే నాకూ పడుతుందని బెదిరించారు"

నిజానికి శీరలన్ ఎవరో రామకృష్ణన్‌కు తెలియదు. శీరలన్‌కు పట్టిన గతేమిటో కూడ అతనికి తెలియదు. కాని మద్రాసులో ఎందరో పారిశ్రామిక కార్మికులకు తెలుసు శీరలన్ ఏమయ్యాడో- శీరలన్‌ను పోలీసులు హత్యచేసారు.

ఈసంవత్సరం మద్రాసు మేడే ఉత్సవాల్లో 'శీరలన్‌ఎక్కడ' అనేశీర్షికతో కర పత్రాలు పంచబడినాయి. ఆయనను సాయుధులైన పోలీసులు తగలబెట్టి చంపేసారని అందులో ఆరోపించారు. పోలీసు ఇన్‌స్పెక్టర్లు నక్సలైట్ సానుభూతిపరులను శీరలన్ విషయం తిరుగతోడవద్దని, లేకపోతే అతనికి పట్టినగతే వాళ్ళకూ పడుతుందని బెది రించారు.

శీరలన్ యువకుడు. లోకసభ ఎన్నికల ప్రకటనకన్న 9 రోజులముందు పోలీ సుల చేతుల్లో చనిపోయాడు. ముగ్గురు పోలీసు కానిస్టేబుళ్లు జనవరి 9న మధ్యాహ్నం 1-30కి అతణ్ణి చంపివేసారు.

నవల – సీరియల్

# కొలిమంటుకున్నది

అల్లం రాజయ్య

[గత సంచిక తరువాయి]

నర్సింహం పట్వారింటికచ్చేటాల్లకు– పట్వారి ఈతసాపల ఎనుక ఒరుగుడు మెత్తలు బెట్టుకొని కూకుండి ముంగటున్న బల్లమీన ఏందో గీకుతండు– ముందుగాల పట్వారినెత్తి– దానిమీన నిక్కబొడిసిన ఎంటికలు కన్పిచ్చినయ్. అటెన్క ఎంటికల తీర్గనే నిక్కబొడుసుకున్న సెవులు– ముక్కుసుత నిలుసున్నట్టుగనే ఉన్నది. గ ముక్కు మీన కండ్లద్దాలు నిలుసుందలేక జారుతున్నయ్. మొద్దుబారిన లొటపెట పెదువులసొంటి పెదువులమీన మాగిన పొగాకు సుట్టొకటున్నది. అండ్లనుంచి పొగత్తలేదు. అయినె మొఖం కోలగ, కండ్లు బడేతేజ్‌గ, సెంపలు సతికిపోయి, ముడుతలుబడి, సచ్చినోని తీర్గున్నడు. గ తేజ్‌కండ్లను సూత్తెమటుకు అయినె సానమందిని సంపనిదే సచ్చెటోని తీర్గలేడు. నర్సింహం పుట్టి బుద్దెరిగిన కాన్నుంచి పట్వారి గౌరయ్య గట్లనే ఉన్నడు. గట్లనే మందికొంపలు ఆర్పిండు– గసొంటి బక్కగ పీరిలకట్టె తీర్గున్న పట్వారి గౌరయ్య సరాలుతేలిన కుడిసేతుల కలంపుల్లున్నది. అది ఏందో రాత్తంది.

పట్వారి సన్నగుంటే– అతని ఇసారాలు మాత్రం మందపుయే. అతనిపెండ్లాం, బిడ్డ, కొడుకులు అందరుసుత పికుల బలిసుంటరు. అతని ఎడ్లు, బర్లు, ఆఖరుకు పాలేర్లనుసుత మందంగున్నోన్నే పెట్టుకుంటడు. గౌరయ్యకు మందమున్నదేదైన ఇట్టమే.

గట్ల తీరుపాటం లేకుంట అంచిన తలెత్తకుంట రాసుకుంటున్న పట్వారిని ఇచ్చెంతరంగ సూసుకుంట "ఎన్నిరూపాయల మాటంటడోనని" భయపడుకుంట అరుగుకు రైతులు నిలుసున్నరు అరుక్కింద.

"పైసలు దియ్యంర్రా.... పైసలు.... ఇగో కనకనికి యాపయి రూపాల నలుపైఏడుపైసలు– ఇన్నావురా కనకా?" తలకాయెత్తకుంటనే అన్నడు పట్వారి.

"ఏందయ్యో పశేలా ఏపేటా తాసీలు పెరిగిపోతందిగని నికురంగుంటలేదు. మా అయ్య జమాన్ల మూడుర్రూపాలు గట్టేది– నిరుడు గీ దెవుసంల నలుపై రూపాలే తీసుకుంటిరి– నిరుటి కియ్యేటికి పదిరూపాలు పెరిగినయా? గిట్ల పెరుక్కుంటబోతె మాపెండ్లాల పుత్తెపోగులమ్ముకోవాల్సొత్తది– గిది పాపమా పచ్చిభూతా? మారే అడె వడో ఎనకట సెప్పినట్టు పిల్లల బెడ్తుంది" కనకయ్య అందట్లనుంచి ముంగటికి జరిగి

కాల్లమీన కూసుండి పుల్లందుకొని ఆకిట్ల నిలువుగీతలు గీసి లెక్కలుగట్టి "గదంతెక్కడిది" అన్నడు ఆఖరి ముచ్చెటగ.

"మీ అయ్య కాలమున్నాదిరా? మీఅయ్య మూడురూపాలు తాసీలు గట్టిన దెవుసంల రెండురూపాలకు బత్తెడు దినుసచ్చేది- కోకరయికెబెడితె కొట్టమంత పెండ్లామచ్చేది- నిరుడున్నట్టు ఇయ్యేడు ధరలున్నయా? అన్నిటిధరలు పెరిగినస్తే కాయితం కర్సు పెరిగిపోటట్టే- నేంతింటన్నానురా? సర్కారుకు పువ్వుల్లబెట్టి అప్పజెప్పుడేనాయె" పట్వారి సేతులున్న కలంపుల్ల బల్లమీన పతిపదిలంగ బెట్టి నోట్లెసుట్టముట్టిచ్చి జారిన అద్దాల మీన్నుంచి కనకయ్యను సూసిండు.

ఆడనిలుసున్న రైతులు పట్వారి మొఖంలకు సూల్లేక ఒకల మొఖాలొకలు సూసుకున్నరు.

"ఇగో నాదగ్గెర నలుపైఅయిదు రూపాలున్నయ్- సిలుకుమీన తీసుకున్న కాడికి రాయిండ్రి పంతులూ- తమర్ని నమ్మకగాదు. మీదక్కతుంటె ఇయ్యేడు తాసీలు గట్టినట్టులెక్క-" కనకయ్య రొండిలనుంచి జేగర్తగ రూపాలుతీసి ఓటోటి లెక్కపెట్టి- అరుగుమీనికెక్కి సాపల కింద బెట్టిండు. అటివి పట్వారి లపుక్కనందుకొని జేబులేసుకున్నడు. సిలుకును కిందికిసిరేసిండు- కనకయ్య దోసిలితోనందుకొని పానపదిలంగ నెత్తిరుమాలు కొసకు కట్టుకున్నడు.

ఆడున్నోల్లందరికాడ కొసిరి కొసిరి పైసలు దీసుకొని గులుక్కుంట గొలుసు రాతలురాసి తలోసిలుకు పారేసిండు- అళ్ళపేరుమీన తాసీలు ముట్టినట్టుగ అయిదో పదో జమజేసిండు- ఒకడికి కోడిపెట్ట, ఇంకొకనికి నెయ్యి, మరొకనికి సింతపండు గిట్ల సిల్లర పల్లర తెమ్మని మల్ల మల్ల సెప్పిండు.

"ఇగో గౌరయ్యపంతులు సజరు కచ్చెటోడుగాదని ఊకుండేరుసుమా- అటెన్క జుట్లు జుట్లు పట్టుకోవాలె-" ఆఖరుగ గౌరయ్య.

రైతులంత ఎల్లిపోయినంక నోరు తెరుసుకొని నిలబడ్డ నర్సింహంను ఓర సూపులుసూసి, సూడనట్టు ఎటో మొఖంపెట్టి అద్దాలుతీసి భుజంమీని బుర్రపంచెతోని తుడుసుకొని, మల్లపెట్టుకొని నోట్లె పొగాకుసుట్ట అరుక్కిందికిసిరేసి ఊంచి ఏందో గులిగిండు పట్వారి గౌరయ్య-

గిల్ల టక్కుటమారాలు, దొంగసూపులు, కుట్రసూపులు, ఓరసూపులు ఎదురు సూపులు, నాలెముచ్చు సూపులు తెలిసున్న నర్సింహం అరుగెక్కి మొగురంకాడ కూలబడ్డడు.

"జరంత పని బడచ్చినుంద్రి" నర్సింహం.

"పనిబడకుంటె పట్వారి మొఖమెవడు సూత్తర్రా?" మాలముల్ల నవ్వునవ్వింఁడు.

"మాలసొంటి గరీబోల్లను తమరు సూడకుంటెవలు సూత్తరుంద్రి- పెద్దోల్లయిన- సిన్నోల్లయిన ఊరికి పెద్దలు. కొట్లాటచ్చిన, లగ్గమచ్చినా, కట్టం సుఖం ఏదచ్చిన తమరితోని సెప్పుకోకుంటె ఎవలతోని సెప్పుకుంటం. పసురాలసొంటోల్లం."

"గదంత కొలువా కుమ్మరియ్య- ఏమత్తది. అసలు సంగతేందో?"

పొద్దటి నుంచి జరిగిన సంగతులన్ని పూసగుచ్చినట్టు సెప్పుకచ్చిండు.

"గరీబోన్ని- ఏదో మీ మీ కాళ్ళుబట్టుకొని ఇంజనుపాయం సేసుకుంటి- గది గట్టుకు కట్టెలు మోసినట్టయి పోయింది. అన్నిదిక్కులై పోయి ఆఖరుకు మీకాడికచ్చిన. మంచిన తెల్సిన తమరేదిక్కు- మాటసాయం జేసింద్రంటే- మీకట్టమేముంచుకోను" అని కాల్లుమొక్కటానికి అంగిండు.

"ఉండుండు-" అని కాల్లు ఎనకకు జరుపుకున్నడు. గిది మరెవలదో అయితె- గండట్ల పెద్దొర ప్రతాపరెడ్డి లేకుంటె ఎంతసేపైన మొక్కిచ్చుకునేటోడే కాళ్ళు. కానిది అలాంటిలాంటి కొట్లాటకాదాయె.

"ఇగో నర్సిమ్మా- నేను నీమంచిగోరి సెప్పుతన్న- దొరది తప్పోఒప్పో గిదంతయినంక ఇసారిచ్చి లాభమేంది? దొరే ఇసారిచ్చి దయదల్చాలే- ఇన్నవా? పెద్దోనిమీన కోపమత్తె ఏంజేత్తము? ఏంజెయ్యలేము- గ సంగతి బయట పొక్కిందా పెయ్యంత పెద్దకొత్త సందులేకుంట పేలిపోద్ది. ఆడికే అయిపోద్దా? నాగుంబాముపగ నూరేండ్లంటరు- ఆకుకు అంటకుంట పోకకు పొంటకుంట కుక్కలు సింపిన ఇత్తారోలె మనబతుకు తెల్లారిపోద్ది- గియ్యన్ని ఒకడు సెప్పేటియిగావు. ఎవనికాడు గునాంచుకోవాలె- రెండెకురాల నరోనిపే గింతగన మెగురుతే- ఏయిలెకరాల జమిందారు- గసొంటోన్ని ఏలుబెట్టి సూపవళమా? ఆడికి దొర పాలేరోనిమీన కెలబడ్డవు- గీముచ్చట దొరకెరికయ్యిందంటెనే ఏమయిపోతదో? సరే అయిపోయిందయిపోయింది- నామాటను. గిదే కాల్లమీన దొరింటికురికి కాల్లమీనపడు. తప్పయిందను. నాఎరుకల శరనన్నవాన్ని సెడగొట్టిందిలేదు. దొరది ఎంతైనా దొడ్డబుద్ధిరా?" గౌరయ్య కొత్తసుట్ట ముట్టించిండు.

నర్సింహం గౌరయ్య నెత్తిని సూసుకుంట మొగురాని కత్తుకపోయిండు. "తమరుసుత గంతేనంటర!" గొంతు అణికింది

పట్వారిసుత ఎవలతరుపున మాట్లాడిండో ఎరుకైనంక ఇగఆడ ఉండబుద్ది కాలేదు. మళ్ళ బజాట్లకచ్చిండు నర్సింహం.

"ఇగో నర్సమ్మా.... తాసీలు.... తాసీలు పట్టుకరా. నర్సమ్మా మాట... బొత్తిగ పొవాకొడిసిందిరా. ఎవలతోనన్న కొద్దిల పంపియ్." గౌరయ్య కీకేసిండు.

నర్సింహం తుపుక్కున ఊంచిండు.

'ఇల్లుగాలొకదేడిత్తే ముండకోసం ముసలోడేడిసిండట–" అనుకున్నడు.

పల్లగడే బజారు. గయ్యేబురుదమడుగులు– ఎత్తులంపులు.... నర్సింహం నడువనైతే నడుత్తండు గని– ఎటుకెళ్లి పోతండో? మళ్ళెటు పోవాల్నో? ఎవలతోని సెప్పుకోవాల్నో సమజ్ కాలే....? ఇగ ఊళ్ళె మిగిలినోల్లు పెద్దమనుషులు కోమటి రామలింగం, మల్లయ్య, మైసయ్య, లచ్చింమల్లు, నర్సయ్య ఎందరుంటేంది? అళ్లు దొరనీడను జూసే జడుసుకుంటరు. దొరన్న మాటింటెనే అంగంగి మొక్కుతరు. మరింకెవడు తనపచ్చాన మాట్లాడేటోడు.... "అందరు ఒకల నీడన ఒకలు బతికెటోల్లే– దొరబంట్లు– దొరకాల్లమీన బడన్నట– కట్టెపుల్లసొంటి గౌరడు సలా సెప్పుతండు. ముకుంద రెడ్డోడు మొఖం మాడ్సుకొని తన పాలేరోన్నే కొట్టినట్టుగ మాట్లాడిండు. కట్టెపుల్ల గౌరన్ని నడిమికిరువాలె– మాలిపటేలోని నున్నటి గుండుమీన బండెత్తెయ్యాలె– అంతాపగటి బద్మాషులు– ఒకటేమాట.... ఒకటేసేత.

గింతేనా? దీనికి ఇరుగుడు లేనేలేదా! మక్కపెరడి నీల్లుజాలక ఎండిపోద్ది– కరంటుమోటర సిలుము బట్టిపోద్ది ఇగ గీజల్మల కరంటు లంజకొడుకులు కంభాలట్లిడిసి పెట్టి కాలుసుతబెట్టరు. ఏడాది తిరిగిపోతే కోమటోడు అప్పుకాయితం తిరిగేత్తడు– అడ్డికడ్డని నాసడుం పూసటొక్క ఇరుగ్గొడుతడు. ఉన్నదిబోద్ది ఉంచుకున్నదిబోద్ది. ఇంజనే నడిసేదుంటే ఎరకఅరి నాటేత్తే పుట్టెడు అడ్లయితే– పుట్టెడుసర మక్కలైతే! అది గాదంటె ఎకురంనర మిరుపతోటేత్తే ఒల్లక్కలకు అయిదారు ఏలత్తయి. కోమటోని బాకి తన్నుకపోద్ది. ఒక్కేడుకే బాకీలు సాకీలు సుత్తయి ఇంజను మిగులుద్ది, భూదేవర ఎత్తుకుంటె ఏమో ఎవడు కలగన్నడు? బక్కోల్ల రైతుబతుకే మారిపోవచ్చు. రెండెకురాలనర ఇరువైఎకురాలయి పోవచ్చు.... ఇంజన.... ఇంజన పెట్టు కుంటెనే ఇయ్యన్నయితయ్. ఆరు నూరైనా నూరు ఆరైనా నీయక్క నా పెరట్ల ఇంజను నడువాలె...." గిట్ల మనుసుల కొంత మీనికి కొంత లోపట ఎదురుకుంట నడుత్తన్న నర్సింహంను దారెంట కల్సినోల్లు కొందరు ఇడ్డూరంగ, మరకొంత మంది అసలు సూడకుంటనే ఎల్లిపోయింౘ్రు.

గట్ల పరధ్యానల పడి నడుసుకుంట కొంతసేపటికి తనకుతనే క్యాలికచ్చి సుట్టూత సూసిండు– ఎదురుంగ నర్సమ్మసామిగుడి– గుడికాడినుంచి అడివిలకు తొవ్వ

తొవ్వపక్కన్నే మందోట- నర్సింహం ఊరవతల కచ్చిండన్నమాట.

పగపెండ దంచేత్తంది. ఆకసంల మబ్బుతునకలు దూదిపింజెలెగిరినట్టుగ ఎగురుతన్నయ్- మందోట్ల ఎవడో ఉబ్బుసెంపలోడు పెండ కుప్పేత్తండు- ఆ దారంట పెయ్యంత పెముటలు గారంగ గండపేగు కట్టుకున్న అడిది కట్టెల మోపెత్తుకొని సరసర ఉరుకుతంది.

నర్సింహం మొగులుకెల్లి సూసి నెత్తిగోక్కున్నడు. అంతేందో పిచ్చి లేసినట్టుగున్నది- కడుపుల తొండలు తిరుగుతన్నయ్- మనుసుల మంటలు లేత్తన్నయ్- ఎటూతోసక గుళ్ళెకు నడిసిండు- గుళ్ళె బాయినిసూసి పాణం లేసచ్చింది- ఎప్పటి నుంచో దూపయితన్నట్టు గనిపిచ్చింది. నీల్లు సేదుకొని తాగిండు- ఖాలి కడుపుల నీల్లు పడేటాల్లకు కండ్లు మసగబ్మినయి. మెల్లెంగ గుడి మొండిగోడమీన కంభానికానుకొని కూకున్నడు. మోకాల్లమీన గద్దువ బెట్టుకొని ఎటోసూసుకుంట- ఏందేందో ఇసారిచ్చుకుంట సానాసేపు కూకున్నడు.

గట్ల ఎటెటో సూసుకుంట ఇనుప తలుపులెనుక ఎర్రటి పట్టుగుడ్డలతోనున్న నర్సిమ్మ సామిని చూసిండు- నర్సిమ్మసామి కుడితొడమీన ఆదిలచ్చిమి సిలుకపచ్చ పట్టుసీరెతో నున్నది.

"సామి నువ్వు ఇనుప తలుపులెనుక కష్టేసున్నవ్- నాసుట్టూర గోడలు తలుపులు లేకున్న- నాకేందో కట్టేసి నట్టుగనే ఉన్నది- నా కాళ్ళకు సేతులకు కప్పడని గొలుసులున్నయ్- నానోటికి కప్పతాళమున్నది. నువ్వేమొ ఇరన్నకసిపుని డొక్కసింపి పేగులు మెడకేసుకున్నవ్- మరినేనో? దొరముంగటికి పోయేటందుకే గజగజ అనికి పోతన్న. నీపేరు నాపేరు ఒకటే.

నీకేంది మారాజువు- గట్ల కాలుమీన కాలేసుకొని రాజాంతంగ కూకుంటెనే- కొబ్బరికాయలు గొడ్తరు. కోడిపుంజుల- గొర్రెపోతుల కోత్తరు- సౌరెడు నెత్తురు పురినెడు పేసుకొని అరుగాలం కొట్టిపోసుకున్నా- కంచంలకు బువ్వరాదు. ఎందుకెరికేనా? నువు దేవునివి. నేను నరున్ని- నువు ఒంటినాగలి నర్సిమ్మనివికావు- దేవాన దేవతలు దొరలు ఏలుకునే నర్సిమ్మరెడ్డివి." నర్సిమ్మసామికెల్లి కోపంగ సూసిండు.

నర్సిమ్మసామి మీన్నుంచి సూపులు మలుపుకొని, మొఖంతిప్పి, కూలిపోయిన గుడి పడారి గోడలనుంచి చూసిండు- దూరంగ దొర 'గడి' కనపడ్తంది. ఎత్తుంగున్న మట్టి గడిగోడ లోపల బంగుల కొనలు కన్పిత్తన్నయ్- బంగుల పక్కకు సెట్లకొనలు కన్పిత్తన్నయ్. సింతసెట్టుమీన గద్ద తీర్గున్నది కూకుండి దిక్కులు సూత్తంది.

"దొర గంతపెద్ద బంగుల ఎట్లగట్టిండు? కట్టిండంటె కట్టిండు- ఎట్లగడితె నాకెందుకు? నాకు గావాలె కరంటు కంభాలు, తీగె- కావాలనుకుంటె గీ గుడి గోడల మీన కూకుండి పెక్క భజనలుసేత్తె తెల్లారెటాల్లకు పెరట్ల మొలుత్తయా? మంత్రాలకు సింతకాయలు రాల్తయా? ఎట్ల మొలుత్తయ్. ముకుందరెడ్డి గాడన్న సెప్పి సూత్తడనుకుంటె- వాని పొట్టినోట్లె.... సేతులెల్లలుకలేసిండు. గౌండ్లు దొరకింది కుక్కేనాయె. మరింకెవడు? ఎవడులేడు? ఎవడు నాకోసరం సాయంరాడు- ఒకని కడుపునొప్పి ఇంకొనికేందురుడ- కడుపు నొచ్చినోడే ఓమ బుక్కాలె- ఒకని కొకడున్నంక ఊరు గిట్లెందుకుండు?

ఎట్లయితె గట్లయిద్ది- నేనేపోత. కాల్లెక్కలిరిసి దరువాజ కేలాడగడ్తడా, కట్టనీయ్ సిరుసుగోసి సింతకింద బొందబెడ్తడా? పెట్టనీయ్. తెగిన బొక్కెన నూతిల దాక- దెగబడ్డోనికి తెడ్డేలింగం. తెగబడాలె" నర్సింహం గుడి గోడమీన్నుంచి గుబిక్కిన కింద దునికిండు. కండ్లు సికిలిచ్చి పెదువులు కొరుక్కున్నడు- గడ్డాన్ని అరిసెయితోని రాసుకున్నడు- అటెనుక ఎవలో ఎనకనుంచి దొబ్బుతున్నట్టుగ పెద్ద పెద్ద జంగలేసుకుంట దొరగడికెల్లి నడిసిండు.

ఎండ కెండి, ఆనకు తడిసి పెచ్చులూడిన గడి మట్టిగోడ ఆడాడ కూలిపోయింది. కూలిన కాడల్ల రాతిగోడ కట్టిచ్చిండ్రు.... ఎన్నేండ్ల నుంచో ఎండల్ల, ఆనల్ల గట్లనే పడున్న గ గోడను సూత్తె ఎప్పుడనంగనో సచ్చిపోయిన తన మామ యాదికత్తడు నర్సింహంకు.

బజారు ఎడల్పెక్కువై- ఎగుడు దిగుడు సదునైంది.... గక్కన్నుంచే దొర గడిలకు తొవ్వ మొదలైంది-. గక్కన్నే గుడిసెపాగిండు నర్సింహం.... అడుగులు తడబడుతున్నయ్.. గుండె మాంచి జోరుతోని కొట్టుకున్నది. మెదట్ల ఎప్పటియో గ్యాపకాలు ముసురుకున్నయి. కండ్లముంగట ఎపలెపలో కన్పడ్తండ్రు.

నెత్తిమీన ముఖం కన్పియ్యకుంట ఎలిసిపోయిన సీరెకొంగు కప్పుకొని,కొనపండ్ల సందు నిరికిచ్చుకొని- అత్తన్న ఏడుపును గుండెల్లనే ఉగ్గపట్టుకొని, బిక్కిరి బిక్కిరి సూసుకుంట- తడబడ్తన్న ఆడది. అమె కుడిసెయి పట్టుకొని నారపేడసొంటి బరిబాత పిల్లగాడు సీకట్ల అడుగులడుగేసుకుంట- ఎటు పోతన్నడో సమజ్ కాక, నిదర్ల నడుత్తన్నట్టుగ.... అళ్ళిద్దరి ముంగట- గుబురు మీసాల సుంకరోడు బరిసె నేల మీన పొడుసుకుంట నడుత్తన్నట్టుగ- ఎప్పటిదో యాదికి.... పదేండ్ల పిల్లగాన్ని ఎక్కెక్కిపడి ఏడ్వంగ గొరగొర ఈడ్చుకచ్చి బజాట్ల మట్టె పారేసిన ఇద్దరు సుంకరోల్లు- దిక్కు

లేక- పిల్లగాడు కడుపుల పేగులు తెగిపోయేటట్టు ఏడిస్తే- ఎవరు దగ్గరకితీయని యాదికి- కొన్ని మసకమసకగా మరికొన్ని ఇప్పుడిప్పుడే కండ్లముందు జరిగిపోతన్నట్టుగ అన్పించింది.

నర్సింహం మెదట్లనుంచి గయ్యన్నిటిని తుడిసి పారేయాలన్నట్టుగ నొసలు రుద్దుకున్నడు.

అదేతొవ్వ ఇరువై అయిదేండ్లకింద తొక్కినతొవ్వ- గిప్పుడు మళ్ళ తొక్కుతండు- అడాడ కూలిపోయున్న పెద్దరువాజ కాడ గుడిసేపు ఆగిండు. భయం భయంగ ఎదురుంగ చూసిండు- ఎదురుంగ నల్లగా మాగిన నగిషీలు సెక్కిన మొగురాలు- రంగులు పూసిన తలుపులు- నలువరాళ్ళ అరుగు బంకులు- బంకుల్ల నల్లగమాగిన కుర్సీలు, కుర్సిమీన పచ్చల పులితోలు కన్పిచ్చినయ్.

గేటుకు పెట్టిన పెద్దపెద్ద రాల్లను చూసిండు.

"ఇక్కనుంచే ఎనకకు తిరిగి సూడకుంట- ఎవరాపిన ఆగకుంట ఉరుకాలె అదే పులిసూపులు- గ సూపులకిందనే మాది మసిబొగ్గయి పోయిన యెన్నో బతుకులు? మల్ల గ బోనులకే పోతండు. ఇయ్యన్నిటికి సానా దూరంగా ఉరుకాలె" అనుకున్నడు. సెమటల్ పట్టినయి- గొంతిక తడిలారిపోయింది. కాళ్ళు పట్టుతప్పి పోయినయి. నడువ లేనోనితీర్గ నిలుసుండి పోయిండు.

అతని కండ్లముంగట గురగుర సప్పుడు సేసుకుంట తిరుగుతన్న కరంటు మోటర, ఇనుప గొట్టంలనుంచి ఇచ్చంత్రంగ సిమ్ముకత్తన్న నీల్లు ఎర్రగ పండిన మిరుపతోట- కంకవసంతీర్గ పెరిగిన మక్కజొన్న పెరడు- బంగారంతీర్గ మూరెడు మూరెడు గొలిసిడిసిన అరిపొలం కనిపించినయ్- కాల్లకు బలమచ్చింది. గదే ఊపుల సెక్క తలుపుల పెద్దరువాజ దాటి అకిట్ల అడుగుబెట్టి గుండెలనిండా గాలి పీల్సుకున్నడు.

పాతదే గడిఅసన.... పూలఆసన.... భయపెట్టే కామోషి గాజుపెంకలు పలుగ్గొట్టినట్టు అప్పుడప్పుడు కచ్చీరు ఇంట్లనుంచి ఇనచ్చే ఏడుపులు- ఉండుండి ఇనచ్చే మొత్తుకోల్లు- బూతుతిట్లు- బుర్రలో రాళ్ళేసి ఊపినట్టుగ ఇనచ్చేసప్పులు- గియ్యన్ని ఇప్పుడిప్పుడే ఇంటన్నట్టుగ గిప్పుడు గిప్పుడే సూత్తన్నట్టుగ ఉన్నది.

నర్సింహం నిలువెల్ల సెమట కార్తంది- సింతసెట్టు మీన్నుంచి పూలసెట్ల తాక్కుంట సన్నగా గాలిసురుతంది- అయిన నర్సింహంకు గాలిలేనిఇంట్ల పడేసినట్టుగనే ఉన్నది.

ఇంకొంచెం ముంగటికి నడిసి పులితోలు కుర్సికెదురుంగ నిలుసున్నడు- గ కుర్సి మీన అదేరూపం పెడుసుగా అంకతిరిగిన మీసాలంతుకు సన్నంగా తలువారు కట్టగొట్టిన మీసం. నున్నంగ కొరిగినగడ్డం- పగటించి ఎండసొంటి కండ్లు- రెండు పచ్చాలుగ సీలిపోయిన గద్దువ, సలువసేసిన మల్లెపువ్వసొంటి బట్టలు, పొగాకు సుట్టంతుకు నోట్లె తెల్లటి సికిలేటు- కండలు తిరిగినసెత్త.

ఇరువై అయిదేండ్ల కింద గదే కుర్సీ- గదే పులితోలు- అవే సూపులు- గదే రూపం.... కని గ కుర్సిమీన అప్పుడు గూకుండే పులిపేరు లక్ష్మారెడ్డి.... గిప్పటి పులి పేరు ప్రితాపరెడ్డి.

ప్రితాపరెడ్డి కుర్సిల జారగిలబడి ముంగటున్న ముక్కాలు పీటమీన కాల్లు బార సాపి అక్బారు సూత్తండు- అయినె ఎడంసేతికి బంగారు రంగు గడియారం- పక్కకున్న కుర్సీమీన బంగారపు రంగు సికిలేటు డబ్బ- దాని పక్క అగ్గిపెట్టె.... అక్బారు మీన అతని ముఖం ఉన్నయ్.

ముఖంసూసేటాల్లకు నర్సింహం గొంతిక తడి ఆరిపోయింది. సానాసేపు మాట పలుకు లేకుంట నిలుసున్నడు.... దూరంగ సింతసెట్టుమొదట్ల సుంకరోల్లిద్దరు గుసగుస మాట్లాడు కుంటంద్రు- ఆళ్ళ పక్కనే ఓ ముసలోడు ముసల్ది గంపలు పట్కోని నిలుసున్నరు.

నర్సింహం నోరు పెకిలిచ్చి ఏందో సెప్పాల్నను కున్నడు.... పాతకాలే.... సేతులు జోడిచ్చిండు.... దొర గ సేతులనన్న సూత్తే మాట్లాడవచ్చు ననుకున్నడు- దొర ఎటూ సూల్లేదు.

మందంగా, మెరిసే మెత్తటి సెత్తతోని లబ్బరు బొమ్మతీర్గ- పొట్టి లాగుతోని మెడల పులిగోరు బంగారు గొలుసుతోని- దినమంత తనను తన్నుకుంట, తను పడితే ఇరుగబడి నవ్వే పిలగాడు నర్సింహం ఉదెంల మెదిలిండు- కూసంత ధైర్నెమచ్చింది- కొంచెం ముంగటికి జరిగిండు- సిన్నంగ దగ్గి.... "దండాల్ బాంచెన్...." అన్నడు నూతిల నుంచి మాట్లాడినట్టుగ.

ప్రితాపరెడ్డి గ దండమన్న మాట ఇనుపిచ్చుకోనట్టే కనిపిచ్చిండు- కని ఆతని ముఖంల రంగులు మారినయ్- సేతులున్న అక్బారు గట్లనే ఉన్నది.

సింత సెట్టుమీన దొరంటె భయం భీతి లేని గొరెర్రింకలు కొట్లాడ్తున్నయి.... బంగుల మీనింట్ల ఎవలో కోపంకొద్ది ఈణ అయించుతంద్రు.... లోగింట్ల ఎక్కణ్ణో గోడలు ధనిచ్చేటట్టుగ కుక్క మొరుగుతంది.... దాన్నెవలో బతిలాడుతంద్రు....

పొదసాటుకు పొంచున్న పెద్దపులితీర్గ దొర అక్బారుసాటుకు మొఖం పెట్టుకొనున్నడు.

నర్సింహంకు అటెన్క ఏంజెయాల్నో సమజ్కాలే- తనెందుకచ్చిండో మరిసే పోయిండు- కాల్లు గుంజుక పోతన్నయ్- సుంకరోల్లు మాటలాపి దొరకెల్లి సూత్తంద్రు- అట్ల ఎంతసేపున్నరో తెలువది- సానాసేపటికి అక్బారు కదిలింది- దొర మొట్టమొదట నీలం ఆకసాన్ని, అటెన్క సింత సెట్టును సూసిండు. ఆఖరిసూపుల నర్సింహంను బట్టలూడదీసి కత్తితోని గాట్లుపెట్టి మిరుప్పొడి అద్దినట్టుగా, బల్లి ఈగను సూసినట్టుగ తొండ సీమను సూసినట్టుగ సూసిండు.

"దండాల్ దొర- మన్నించాలె దొర- మన్నించాలె బాంచెన్.... గరీబోన్ని...." మాట గొంతికల లుంగలు సుట్టుకపోయింది.

దొర నవ్విండు.... భయపెట్టే నవ్వుతీర్గున్న గ నవ్వుల గేలిసేసుడున్నది.... గట్లనవ్వుకుంట నవ్వుకుంటనే- నవ్వు ఆఖరైన కొద్ది అతని మొఖంల కోపం అచ్చింది- అక్బారు మలిసి పక్కనున్న కుర్సిల పారేసిండు- సికిలేటు ముట్టిచ్చిండు- దమ్ము ఇగ్గి ముక్కులనుంచి పొగూదిండు....

"నర్సమ్మా నీకు భూమ్మీన బతకబుద్ధయితలేదా?" ఆ వొక్క మాటని మల్ల సికిలేటు తాగిండు- పుళ్ళేమనుకున్నడో బారజాపిన కాళ్ళు పీటమీన్నుంచి తీసి కుర్సిల ముంగటికి అంగి, నర్సింహం మొఖంలకు సూటిగ సూసిండు.

"గోసిగుడ్డంత కోంద్రకు పంపెందుకురా? పంపుబెట్టుకొని సుఖంల పడతననుకున్నావురా? మోటగొట్ట సాతనైతలేదా? సుఖపడు.... కని నాకర్జంటుగ కరంటు కావల్సచ్చింది" అన్నయి పోయినట్టుగ మరింక మాట్లాడ ఇష్టంలేనట్టుగ లేసి ఎనుకకు సేతులు గట్టుకొని బంకుల్ల అడికీడికి తిరుగబట్టిండు.

గదేంమాటో నర్సింహంకు సమజ్కాలే.... మీనికెల్లి "నాకావాల్సచ్చింది" అని తీవిగ- దొర తోట్ల కంభాలు తను పీక్కచ్చి నాటుకుంటే మల్ల తనయి తను పీక్కపోయినట్టుగ- దొర మాట్లాడంగనే ఏమనాల్నో తోసలే- దొరన్నసంగతి సమజయ్యేటాల్లకు గుప్పున ఉదెంల మంట లేసింది. అయినా దమ్ముగాసి అనికే గొంతికను అదుపులబెట్టి, ఇంకొంచెం ముంగటికి జరిగి సేతులు జోడిచ్చి-

"తమరు దొరలు.... కూటికిలేనోనితోని పరాసికం తగదు బాంచెన్- తమరి లాంటి మారాజులు గీ గరీబోని మీన పంతంబడితెట్ల బాంచెన్? తమరికి కంభాలు గావాలె కాదన- తీగ గావాలె- నిచ్చమే- తమరు ఎయ్యికాళ్ళ జెర్రిలు. కో అంటె కోటి

మంది ఉరికత్తరు. నిలుసున్న కొడికి ఏది వడితె అదిత్తది. ఒంటిగాన్ని. ఎనుకా ముందు ఏదిక్కులేనోన్ని- తమరికెరికలేంది ఏమున్నది? సిన్నప్పటినుంచి తమరు సూత్తలేరా? సంకలేవడితె ఖర్జం కండ్లబడ్తది. నీబాంచెన్ దొర కాలుకు బట్టకుంట తిర్గని జాగలేదు. మొక్కని కాప్పులేవు." తతిమ్మ మాటలు గుక్కతిప్పుకోంగ అడుగునబడి పోయినయ్.

దొర పొద్దాల జరిగిన దానిగురించి అడుగుతడనుకున్నడు. దాని గురించి గప్పుడే సెప్పాల్ననుకున్నడు- దొర తప్పయిని ఒప్పయిన తన పాలేరోన్ని ఎనుకేసుకో కుంట ఉంటడా? గట్ల ఎనుకేసుకో నోడయితె ఎడ్డిబాననికంత జోరు ఎందుకుండు? ఆడు మందబలం సూసుకొని కుక్కమొరిగినట్టు దొరబలం సూసుకొనే మీదెగబడె.

దొర ఓరగా నర్సింహంను సూసిండు- బొక్కలెల్లిన భుజాలు. నెత్తికి సుట్టిన పాత గీతలరుమాలు. కండ్లల్ల దొరతనాన్నే సవాలుచేసే సూపు- ఇంకోవేపు గీమాలుదు. మాసినగడ్డం- నొసలుమీన ఎప్పుడో కారిన నెత్తురు మరుక- ఎడంసెంపమీద దెబ్బ తాకినట్టుగ గుబ్బ- నరాలు దేలిన పుల్లలసొంటి కాల్లకు మన్ను- గీరుకపోయిన మోకాలు సిప్పలు- సెప్పుల్లేని పాదాలు- ఎండకు అడలిపోయిన ఎర్రిటిసెత్త- అంటుకపోయిన కడుపు- నర్సింహంను సూత్తే నెనరుపుట్టెటట్టుగనే ఉన్నడు. కని గ కోలకండ్లల్ల సవాలు సూత్తనే రెడ్డికి మండుకచ్చింది. గదానికంటె "గీ లంజకొడుకు సాపుసీద గడీలకే అచ్చి అడుగుతండ"ని ఎర్రికోపం-

"పుర్రెల పురుగుగిన మెసులుతందా? మస్తెక్కిందిర నర్సిమ్మా? పొద్దున్నే నకురాల్ సేసినవట బంచత్- దొరంటె ఏమనుకున్నవ్? ఎవలతోని మాట్లాడ్తన్నవో ఏడ మాట్లాడ్తన్నవో తెలివున్నదా? వారీ నర్సిమ్మా! కంభాలు, తీగ నేనే పీకిచ్చిన ఏంజేత్తవురా?"

నర్సింహం అనుసుకున్న మంట పైకెగిసింది. రోమాలు నిక్కబొడిసినయ్- భయాన్ని గియాన్ని ఎనుకకు నెట్టేసి ఎవలో కొత్తమనిషి మాట్లాడ్తన్నట్టుగ-

"నేనేమంట బాంచెన్- ఏమంటదొర- తమరు అయిదు వేలెకరాల జమీందార్లు. గంతటి తమరిని నేనేమన గలనుండ్రి- ఎందు నెరుకలేనోల్లను సూసి ఎకురాలకెకురాల జమీను నాదన్నప్పుడు ఏమన్నముండ్రి- మీబాంచెలమన్నము. అయినాసుత మాలోపట కొందరికి భూమ్మీన నూకలు సెల్లిపోయినయ్- ఇయ్యేల్ల పాతుకున్న కంభాలు సుట్టు కున్న తీగ పీకిచ్చుకొని తవరి మిరుపతోట్ల నాటిచ్చుకున్నరు- నిన్న మాఅయ్యవ్వ మీ అవుసరంమీన్నే సెల్లిపోయిండ్రు- రేపు పాలేరోల్లకు జీతాలియ్యాల్నని కోతకచ్చిన పెరడు కోసుకచ్చుకుంటరు. ఆవలెల్లుండి ఇంకోటవుసర మంటరు- ఎనుకెవడో సెప్పి

నట్టుగున్నది ఎవారం. కల్లు తాగబుద్దయి తాళ్ళపీక్కచ్చి ఇంటెనుక పెట్టుమన్నట్టుగున్నది కత- అయ్యా! దరమదొరలు తమరి కవుసరం లేందేంది? మేం పెంచుకున్న గొడ్లకాన్నుంచి సేసుకున్న పెండ్లాలదనుక అన్నీ అవుసరముంటయ్. మాకవుసరమున్నదల్ల గీజానెడు పొట్ట- బెత్తెడుమానం" అని కడుపుకొలిసి చూయించిండు.

అన్ని భయాలు ఒదిలి అంతుపొంతు లేకుంట గిట్ల అదిరిండు నర్సింహం.

ప్రతాపరెడ్డిపండ్లు పిండిపడ పటపట గొరికిండు- సింతకింది సుంకరోల్లు దొర మొఖంసూసి దొరకోపం తెలుసుకున్నరు- ఆళ్ళిద్దరు నర్సింహంకెళ్ళి నడిసింద్రు.

దొర నిప్పులు కురుపిచ్చుకుంట నర్సింహంను సూసిండు- రెండు సేతులు కలిపి సప్పట్లుగొడితే నర్సింహం పనిఖతమే. ఇద్దరు సుంకరోల్లు నర్సింహంను ఏకీలుకాకీలు ఇరిసేసెటోల్లే- ఎందుకనో దొర కట్ల అన్పియ్యలేదు- ఇంకొకడింకోడైతే ఇవ్వారకే పెయ్యంత నెత్తుర్లు సిమ్మేదే- పట్నంమొలల సెప్పు పెయ్యంత తడిమి సూసేదే.... ఆ పనిసుత సెయలేదుదొర-

సుంకరోలిద్దరికి గీదొర కొత్తదొర తీర్గగన్పిచ్చిండు-

దొర నర్సింహం నేమసకుంటనే ఇసురుగ ఇంట్లకు బోయిండు. మెట్లమీన దొర అడుగులు కోపం కొద్ది పడ్తన్నయ్.

లోగింట్ల పరదాలు దాటి, మోగుతన్న ఈణ నాదాన్ని దాటి, సింతసెట్టుమీని గొర్రెంకల సప్పుడును దాటి,నర్సింహాలు మాటలు దొరకినపడ్తనే ఉన్నయ్. ఒక్కొక్కమాట గురిపెట్టి ఇడిసిన బానంపుల్లోలె ఇంట్లకు సొచ్చుక పోతనే ఉన్నది.

సుంకరోలిద్దరు తాళలేక నర్సింహాలు జబ్బలు పట్టి గొరగొర గడి బయటికీడ్సేదనుక నర్సింహాలు అదురుతనే ఉన్నడు.... నర్సింహం బజాట్ల, మట్టిల బొక్కబోర్ల పడటం దొర బంగుల మీన్నుంచి చూసిండు- చూసి కిటికి తలుపు మూసుకున్నడు.

సుంకరోలిద్దరు నర్సింహంను కొట్టిన సంగతి దొరకెరికలేదు.

"పూటకు గతిలేని లంజకొడుకులకు కొమ్ములు మొలిసినయ్- ఎంత తెగింపు? ఎంత ధైర్యం? లమ్డికొడుక్కు ఎన్ని గుండెలు? గడపదాటి లోపటికి రానేవచ్చిండు. రావటమటుంచి సుంకరోల్ల ముంగట ఎటువడితటు అదిరిండు. అన్ని సింతకేలాడదీసి తోలు ఒలిపియ్యనుండె- కని కాలం మంచిగలేదు. కాలంరావాలె- అదునుదొరుకాలె- ఏడబోతడాడు? గిప్పుడే ఆడు తప్పిచ్చుక పోయిండు- ఎంతపనైంది?" చెప్పుకింది తేలు చెప్పుమీనికెక్కి కుట్టినట్టుగ, పాదుకపుకుక్క కరిసినట్టుగ, తనమందలున్న అంబోతు పొడిసినట్టుగ దొరకన్పిచ్చింది.

## 2

గోడ గడియారం పన్నెండు గొట్టినా ప్రతాపరెడ్డికి పాడు నిదుర రాలే. అతని కండ్లు ఎరుపెక్కున్నయ్.... అయినె పండుకొన్న కమ్రె శానా పెద్దది- అయినె నిదుర రాక పొర్లుతన్న పందిరి మంచం శానా ఖరీదైంది- గంత పెద్ద కమ్రెల గంత పెద్ద మంచంల పండుకొని దొర శానా ఇరుకుగ ఇసారిత్తండు.

ఆ కమ్రెల నాలుగు సంసారాలు బతుకచ్చు- నాలెమీనున్న తివాసి ఎవరు చేసిందో గని ఇద్దరు పాలేరోల్ల కష్టం రెండేండ్లది మింగుంటది. ఆకుపచ్చ రంగు గోడలమీన పెద్దపెద్ద పటాలున్నయి- పిరికెడు పిరికెడు మీసాలోల్లు, కొన్ని పటాలల్ల నిలుసుండో కూకుండో ఉన్నరు- అళ్ళంత ముసులోల్లతీర్గ కన్పిచ్చిన ఒక్కొక్కల అవును సుక్క రకుతంబొట్టు అడువకుంట తిని మీసాలు తుడుసుకుంటన్న పెద్దపులుల తీర్గ సూత్తెనే ఉచ్చ పడేటట్లుగున్నరు- మీసాలోల్లు గాక ఎదురురొమ్ములు ఎత్తుంగున్న ఆడోల్లు పూసిన తంగేడు సెట్లతీర్గున్నోల్ల పటాలు సుత ఉన్నయి. గ బొమ్మల్ల ఇరుగ బూసిన గున్నమామిడి సెట్టుతీర్గ ఒకామె నిలుసుండున్నది- ఆమె ముఖంల దుఃఖమో? సంబరమో? ఇంకేదున్నదో ఖచ్చితంగ సెప్పటం కష్టమే. ఇంకో పోటువల కాయల బరువుతోని అంగిపోయిన మామిడి గున్నోలె ఇంకొకామె బంగారి నగల మోసుకుంట నిలుసుండి ఉన్నది.... ముఖంల మొగన్ని పోగొట్టుకున్న కలున్నది గని నొట్ట రూపాయెల్ను బొట్టున్నది.

ఇంకోదిక్కు అవలిత్తన్న పులిబొమ్మ- కోపంతోని పంజా ఎత్తిన సిమ్మం బొమ్మ ఉన్నయ్.

ఆ కమురల అయ్యేకాక రెండు సెక్క అలుమారాలున్నయ్- గ అలుమారాలకు నగిషీలు సెక్కేటందుకు ఇద్దరు అడ్లోల్లు ఏడాదన్న తిప్పలు బడుంటరు- ఓ అలుమారాల బ్రాండీ సీసలున్నయ్- దాని పక్కకే సల్లసీల్ల మిషిని, దాని పక్కన్నే జింక తోల్లు కప్పుకున్న కుర్సీలు, కుర్సీల పక్క గుడ్డ కప్పుకున్న సెక్కబల్ల- దానిమీన సికిలేటు డబ్బా ఉన్నయ్- ఇంకో అలుమారాల పత్రాలున్నయ్.

ఆ కమ్రెకు ఎనిమిది కిటికీలు, కిటికీలకు బలంగున్న ఇనుప సలాకలు, మాంచి ఖరీదైన అద్దాల తలుపులు, ఆకుపచ్చ పరదలు సుత ఉన్నయ్- మల్ల కమురె మజ్జెన గాజు దీపాలున్నయ్.

అగో గసొంటి సగిషీల కమ్రల పందిరి మంచాల దొర అటిటు బొర్లుతండు. గిట్ల దొర నెప్పుడు సూడని మంచం కిరకిరలాడ్తంది. మంచంమీని సుతిమెత్తటి దూది పరుపు కంకర్రాల్ల కుప్పతీర్గనిపిచ్చింది దొరకు.... కమ్రల గద్దతీర్గ తిర్గుతన్న గాలిపంఖను పానసేపు సూసిండు దొర.

మంచాల నుంచి మత్తుగ లేసిండు. దాన్రింది అల్మరు కిర్రుమన్నది. సీస మూత సురసుర తిరిగింది. గిలాసల గడగడ కారింది. దొర గొంతుక మండింది.... గిలాస బల్లమీన పెట్టి సీసమూతికి తన మూతి కలిపిండు.

బల్లమీది సూనెల ఏంచిన అడివి పందికూర, కోడి కూర అడివి మనిషి తీర్గ తిన్నడు. తినుకుంట తినుకుంటనే సికిలేట్ల గొంతెకలు పిసికిండు. అయినాసుత ఏన్నో ఆకలి? ఎక్కన్నో ఎప్పటికి నిండకుంటున్న ఖాళీ? కుర్సీ మూలిగింది.... కుర్సీమీన జినుకతోలు కుచ్చుకున్నట్టనిపిచ్చింది దొరకు. కమ్రల ఆడికీడికి తిరిగిండు. మనుసు నెరికి రాలే....

ఎనుక సేతులు బెట్టుకొని మజ్జెన నిలుసుండి గోడలకున్న పటాల సూసిండు. పటాలన్ని గిర్రిగిర్రి తిరుక్కుంట తనను సూసి గేలిసేసుకుంట నవ్వుతున్నట్టుగ అన్పిచ్చింది. సిమ్మం బొమ్మకెల్లి బగ్గసూసి లేని మీసాల మీన సెయ్యేసిండు. పిడికిలి బట్టి ఏన్నో గుద్దాలనుకున్నడు.... మళ్ళ పిడికిలిప్పిండు.

కమ్రల నుంచి బయటికి నడిసిండు.... బంగుల మీన గుడిసేపు ఎటు సమజ్ కాక అటిటు తిర్గిండు. పెద్దర్వాజ కాడ ఎవడో కూరుకుపట్లు పడ్తండు. మూసున్న పెద్దర్వాజను సూసుకొని ముసి ముసి నవ్వుకున్నడు అడుగులడుగేసుకుంట బంగుల మీని మూడో కమ్రదనుక నడిసిండు.

మూడో కమ్ర కిటికీలు తెరిబెట్టున్నయ్.... గలుమల పరద అటిటు ఊగుతంది. నీలం రంగు ఎలుతురు పారాడుతంది. నిదురబోతన్న పెండ్లాం సరసకు నడిసిండు....

నిదురబోతన్న దొర్సాని యమునమ్మ గుండెలు ఎగిరెగిరి పడ్తన్నయ్. గామె మొఖంలకు తొంగి సూసిండు.... మొఖంలేమి సూసిండో ఏమో మీదెయ్యబోతన్న సేతిని ఎనుక కిగ్గుకొని గిరుక్కున ఎనుకకు మలిగిండు.... మొఖం పిడికెకున్నోల్గె సేసుకున్నడు.

మల్ల అయినె అరర్రీల అలుమారి తలుపు కిర్రుమన్నది- తలుపు పట్టుకొనే సాన సేపు పత్తాయించిండు.... గడీలెక్కన్నో భయంలేని గుడ్లగూబ గూసింది- ఉలికిపడి అలుమారి తలుపుమూసి సికిలేటు ముట్టిచ్చుకొని పంచాల ఎల్లెలుకల పన్నడు.

అయినె కండ్ల ముంగట మసకమసగ్గ ఓపారి; తేజ్‌గ ఓపారి బొక్కలెల్లిన నర్సింహం అర్సుకుంట, తిట్టుకుంట కన్పిత్తండు- గట్ల కిన్పిచ్చే నర్సింహంను దూరం గొట్టాల్ననే ఇవ్వారుదనుక తంటాలు పడ్డడు-

దొరకు బొర్రింది ఉన్నది. పడుసు పెండ్లాం.... ఉన్నది. పందికూర, కోడికూర అవ్వల్దర్జగున్నది; తాతలు గట్టిచ్చిన "గడి"- గడికి మూదండి తలుపులు- గడినిండ కో అంటే కోకొల్లలు బాంచెగాళ్ళున్నరు- సౌళ్ళు, సాకర్లు, దాసోల్లు- అన్నిటికన్న ఊశ్కె నోరులేని జనం- తాలుకనుదాటి జిల్లాలుదాటి ఐకోరిటదనుక అయినోల్లే ఉన్నరు- సుట్టు పదిహేనూళ్లల్ల జమీనున్నది. గొడ్డు, గోదా, జమీను, ఇనుప్పెట్టెనిండ డబ్బు, దస్కం. గియ్యన్నుండంగ గ దొరకు ఏం తక్కువయినట్టు గీ అద్దుమనాత్రి నిద్దురెందుకు లేక పాయె- గయ్యన్నిటికి ఎన్నో అయిమూలలుండచ్చు- ఉండకబోవచ్చు- కని నర్సమ్మడు గడిలదాక అచ్చి తన ముంగటనే దొరతనాన్ని ఏలుబెట్టి సూపిండు.... సూపుట మొక్కటే కాదు- ఎటువడితె అటు అన్నడు- అన్నోడు ఠార్‌న సావలే- కండ్లకు కినిపియ్యకుంట గాలే- ఆడింక బతికే ఉన్నడు...." గందుకనే దొరకు అంత అన్లు పెరుగు కలిపినట్టు గున్నది.

"తనకు కంభాలు, తీగ కావల్సత్తే ఇంకెవనికో సంజాయిషీ చెప్పుకోవటమా? ఆడెక్కడ బతుకుతండు- ఏడబుట్టినోడు. ఆడింగ నోరు తెరిత్తే అదులుకు పాణాలొదుల వల్సినోడు- వాన్ని బిడ్డా నాకు కంభాలు కావాల్నని అడుగన్నా? ఆడు సాపుసీదా గిదిసీది అన్నాయెం- అక్కురం- అనకున్నా.... గట్ల అర్థమచ్చే మాటలు మాట్లాడ్తడా? ఎట్లా సూసిండాడు? గ కండ్లల్ల అందరికుండే భయం భక్తి లేపేంది? ఆడు గట్లన్నప్పుడు ఒక్కడు గాదు ఇద్దరు గాదు నలుగురు సూసిండ్రు- నలుగురంటె ఇంకేమన్న ఉన్నదా?

నర్సమ్మన్ని రేపీపాటికి ఎంటిక కనిపియ్యకుంట చెయ్యచ్చు- రేపటిదను కెందుకు? రెండు సేతులు సప్పట్లు సరిత్తే ఇప్పుడే వాడుండడు- ఆడు గీ సంగతి ఊరంత చెప్పుంటడు.... ఆడు సచ్చినా బతికినా రేపొద్దుగాల దొరే సంపిచ్చిండంటరు- గాలికిబోయే కంప ముడ్డికి తలుక్కుంటది- పట్వారి గానికి, మాలిపటేల్‌గానికి ఎవరు సెప్పకుంటనే తెలిసిపోది- తన ముంగట ఆ మాటెత్తరు- దాంకడ్డంరారు.... అది

అలుసు తీసుకొని ఆళ్ళు అడ్డదుపు లేకుంటయిపోతరు- అప్పుడు ఆళ్ళకు తనకు తేడా ఏముంటది?

అదిగాక కాలం మంచిగలేదు- ఖానూస్లెక్కువైనయ్- ఎవడన్న అమీనుకచ్చీన్ల ఊత్తే.... వాడు రోమం పీకడు- కని ఆశపడ్తడు- లేనిపోని పీకులాట లెందుకు?

సినిగిన లాగంగితోని తను తన్నంగ పడుకుంట- తన నీడత్గర తను లేసిన కాన్నుంచి మల్ల నిదురపొయ్యే దనుక తనతోచే తిరుక్కుంట- బల్లెకు తన కితాబులు మోసుకచ్చి తన మంచం పక్కకే కింద నిదురబొయ్యే సన్నటి కట్టెపుల్లసొంటి పిలగాడు దొరకు కన్పడుతండు.... బాయిగడ్డమీన మొఖమంత సితికిపోయిన వానవ్వ పోసాని, దానిమీన పడి గోడుగోడున ఏడుత్తన్న నర్సింహం కన్పిత్తండు-

కని గిట్ల అడిగినోల్ల ఇడిసిపెట్టు కుంటబోతె రేపు గడిగోడల ఎగబాకరా? అనిచి పెట్టకుంటే కూలిలంజకొడుకులు ఏడాగుతరు? ఓకెల్లి తన్నంగనే కండ్లు నెత్తి కెక్కి- ఎగురుతండ్రు- అలుసిత్తే గడి తలుపులే పీకేత్తరు- ఇయ్యాల నర్సిమ్మడు.... రేపు లట్టుగాడు ఎల్లుండి పొట్టుగాడు.... గిట్ల.... సుంకరోల్లు ఏమనుకున్నరో?

ఏ లంజకొడుకును ఇడిసిపెట్టద్దు- ఆపు సూసుకొని బలుపని ఎగిరిన లమ్డికొడుకుల ఆపు బలుపు ఏకం ఎల్లదియ్యాలె.... ముల్లును ముల్లుతోనె తియ్యాలె.... గడ్డపారతోని గాదు- ఏగిరపడితే లాభంలేదు- నర్సిమ్మ డేడబోతడు? దేశాలు దెగిచ్చిపోతడా? తెల్లారిలేత్తే మన కాల్లకాడికి రావాలెగద.... ఇయ్యాల్ల కాకుంటే రేపు....

పక్కల బల్లెమోలె అని పెరడిసెక్కోటున్నది- అసలు కిటుకు గాడున్నది- గదే లేకుంటే గాడెందుకెగురుతడు?.... కుక్కన కేనోలె నా ఘాటిలకు పనికిరాదా? పనికచ్చినోడు మల్ల మాట్లాడ్తడా?....

ఒక్క దెబ్బకు రెండు పిట్టలు.... నీయక్క.... "వారీ నర్సిమ్మ నీ మద మంచకుంటె రెడ్డోని కడుపున్నే పుట్టలేదురా?"

గిట్ల ఇసారించి దొర నవ్వుకున్నడు. నవ్వుకున్నమోలె- గాలికి మబ్బులు సెదిరిపోయినట్టు ఇసారాలు సెదిరిపోయినయ్.... గప్పుడు దొర అటునుంచి ఇటు దిరిగి ఆరాముగా నిదురలకు జారుకున్నడు.

(ఇంకా వున్నది)

సాహిత్య లేఖ :

రుద్రిజ్వాలగారి "భూమికోసం" యక్షగాన నృత్యరూపకం మంచి ప్రయత్నం.

ప్రజా రచయితలు కళాకారులు ప్రజా కళారూపాల ప్రక్రియలో తమ రచనలు సాగించాలని నా ప్రత్యేక విన్నపము. ఇంతవరకు ప్రజా రచయితలు చేపట్టిన రచన ప్రక్రియలైన గేయం, కథ, నవలా, మొదలగు ప్రక్రియలు వ్యవసాయ కూలీలకు రైతాంగానికి అంత ఉపయోగకరమైనవి కావు.

ప్రజలనుండి ప్రజా రచయితలు సాహిత్య ప్రక్రియలు ఎన్నో నేర్చుకోవాల్సి ఉన్నది-

ప్రజల్లో ప్రచారంలో ఉన్న సాహిత్యరూపాలు, యక్షగానాలు, బుర్రికథలు, బుడుగుజంగాల కథలు, వొగ్గుకథలు, పిచ్చకుంట్లవారి కథలు, సారధికాళ్ళ కథలు, పాండలోరి కథలు.... కథావస్తువులు ప్రధానంగా రాజులవైనా, శైలి, చెప్పడానికి ఎన్నుకున్న ప్రక్రియలు వేరువేరు-

వస్తువు తమ జీవితాలకు సంబంధించినది కానిదైనా ఈనాటికి జనంలో ఆ పాటల లేక కళారూపాలకు ఆదరణ ఉన్నది-

జనం జీవితాల్లోని చీకటికోనాలను మనం వారి ఆదరణ పొందిన కళారూపాల్లో ప్రజల కందిస్తే ఇప్పటి ఫలితాల కంటె చాల ఫలితాలు రావచ్చు....

కనుక పాత కళారూపాలను శాస్త్రీయంగా పరిశీలించి, ప్రయోగాత్మకంగా విప్లవాత్మకమైన మార్పులతో ప్రజలకు అందించే బాధ్యత ప్రజా కళాకారులమీద ఉన్నది.

యక్షగాన తదితర ప్రక్రియల మీద దృష్టి మరల్చుతారని, ఈవిషయాన్ని చర్చిస్తారని తలుస్తున్నాను- పైవృత్తి కళాకారుల దగ్గరికివెళ్ళి వాళ్ళనుంచి నేర్చుకోవాల్సింది చాలాఉన్నది.

"భూమి కోసం"లో ముగింపు పద్ధతి ఎప్పుడు సాగే ధోరిణిలోనే సాగింది.... సినిమాటిక్కుగా- అయినా పర్వలేదు చాలా మంచి ప్రయత్నం.

ప్రచారంలో ఉన్న ప్రజాకళారూపాలవేపు తమ దృష్టి సారించాలని ప్రజా రచయితకు విజ్ఞప్తి చేస్తూ....

18-10-78

– అల్లం రాజయ్య

---

## ప్రజా రచయితలందరికీ 'జనసాహితి' విజ్ఞప్తి

కార్మికులకూ, వ్యవసాయ కూలీలకూ, పేదరైతులకూ, మధ్య తరగతి కుటుంబాలకూ, ఇతర ప్రజలకూ సంబంధించిన జీవితాల్ని వాస్తవికంగా, చైతన్య వంతంగా, కళాత్మకంగా చిత్రించే నాటికలనూ, నాటకాలనూ, పాటలనూ, కథలనూ, సంపుటాలుగా ప్రచురించడానికి 'జనసాహితి' సభ్యులేగాక, ఇతరులు కూడా తమ రచనలు పంపవచ్చు.

భూమి సమస్య, ఫ్యాక్టరీ కార్మికుల జీవితం, సమ్మెలు, గని కార్మికుల సమస్యలు, పౌర హక్కులు, నిరుద్యోగం, కుల వ్యవస్థ, గిరిజన సమస్యలు, విద్యార్థుల సమస్యలు, మధ్య తరగతి జీవితం, గ్రామీణ జీవితం లాంటి విషయాల్ని ఇతివృత్తాలుగా తీసుకొన వచ్చును. రచనలన్నీ 1978 డిశంబర్ 31వ తేదీలోగా ఈ క్రింది అడ్రసుకు చేరాలి.

కె. రవిబాబు
ప్రధాన కార్యదర్శి
జనసాహితి, సాంస్కృతిక సమాఖ్య
నగరం P.O. తెనాలి RMS
గుంటూరు జిల్లా - 522 268.

## విరసం సాహిత్య పాఠశాల

1979 జనవరి 13, 14, 15 సంక్రాంతి సెలవుల్లో వరంగల్‌లో విరసం సాహిత్య పాఠశాల నిర్వహిస్తున్నది- భారతదేశ చరిత్ర, సాహిత్యచరిత్ర, సాహిత్య దృక్పథం, నూతన ప్రజాస్వామిక విప్లవంలో సాహిత్యంపాత్ర, ప్రజలపాటలు, కథ, నవల- జీవితం మొదలైన అంశాలపై కె.వి. రమణారెడ్డి, త్రిపురనేని మధుసూదనరావు, చలసాని ప్రసాద్ కాశీపట్నం రామారావు, పి.సి. నరసింహారెడ్డి, చెరబండరాజు, గద్దర్, వంగపండు ప్రసాదరావులు 'పాఠాలు' చెప్తారు.

పాఠశాల నిర్వహణకు అవసర ఆర్థిక, హార్దిక సహాయం చేయవలసిందిగా ప్రజా సాహిత్యాభిమానులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

విరసం, వరంగల్ యూనిట్.

SRJANA Telugu Monthly Dec. 78 H/WI
Regd. No. with Registrar of News Papers 10953/67

తెలుగు దేశాన ప్రజా సాంస్కృతిక బృందాలు పాడుకుంటున్న అరుణోద జననాట్య మండలి పాటలు ఒకేచోట అందుబాటు అయేలా విరసం ప్రచురిస్తున్నది

విరివిగా ప్రచారంలోవున్న పాటలు, మీమీ ప్రాంతాల్లో పాడుకుంటున్న పా వెంటనే సేకరించి పంపించండి. మీ సూచనలకు ఆహ్వానం.

— విరసం, వరంగల్ యూ

---



---

## వ్యాపార ప్రకటనల కోసం విజ్ఞప్తి

సృజన జనవరి నుంచి పుస్తక విక్రేతల, ప్రచురణకర్తల తదితర ప్రజాహిత రంగాల ప్రకటనలు వేయదల్చుకొన్నది- పదమూడు సంవత్సరాలుగా ఆంధ్రదేశంలోనూ, బయటా విశేష ప్రచారంలో వున్న సృజనలో మీ ప్రచారం కొరకై ప్రకటించండి-

ప్రకటన రేట్లు

| | |
|---|---|
| చివరి అట్ట (రెండు రంగులలో) | రు. 300 |
| రెండవ, మూడవ అట్టలు - ఒక్కొక్కటి | రు. 200 |
| మొదటి పేజీ | రు. 150 |
| లోపలి పేజీ | రు. 100 |
| లోపలి అరపేజీ | రు. 60 |
| లోపలి పావుపేజీ | రు. 40 |

ఒక ఏడాదిలో వాడుకునే 12 లోపలి పేజీలకు 25% తగ్గింపు.

**సృజన, హనుమకొండ - 506 001**

SRJANA
Hanumakonda, Warangal - 506 001

Rs.